


సంపుట : ౧. విక్రమ, చైత్రము : ఏప్రెల్, 1940. సంచిక : ౧.

# సంపాదకీయసమాలోచన

**౧. మదరాసు మునిసిపల్ ఓటర్ల లిస్టు తెలుగులో అక్కరలేదా? :—**

మదరాసు మేయరు కాకపూర్వం శ్రీ సత్యమూర్తి అరవమూర్తే అన్నివిధాలా. ఆంధ్ర తమిళ కర్ణాట మళయాళ ఇత్యాది జాతులకు చోటైన మదరాసు పట్టణానికి మేయరైకూడా శ్రీ సత్యమూర్తి ఇంకా అరవమూర్తే ఐవుండడం ఆశ్చర్యకరవిషయం. ఫిబ్రవరి తుదివారంలో మదరాసులోని మళయాళ సమాజపు వర్కింగ్ కమిటీవారు మునిసిపల్ ఓటర్ల లిస్టు మళయాళంల్లోకూడా అచ్చుకావాలని తీర్మానించారు. మదరాసులో పరకపాటుగావున్న మళయాళీలకే అట్టికోరిక వున్నప్పుడు ఇక్కడి జనాభాలో సగానికి సగం వున్న ఆంధ్రులకు అట్టికోరిక వుండటం సహజము, న్యాయము. మదరాసు మునిసిపల్ ఓటర్లలిస్టు తెలుగులోకూడా ముద్రితంకావాలని మదరాసుమండల ఆంధ్రకాంగ్రెస్‌సంఘం తీరుమానించింది. కార్పొరేషన్ కమీషనరు ఈ కోరిక పాటింపదగిందీ, మన్నింపదగిందీ అని ప్రభుత్వంవారికి సిఫారుసుచేశాడు. మేయరు శ్రీ సత్యమూర్తి మాత్రం అరవమూర్తి ఐ మునిసిపల్ ఓటర్ల లిస్టు తెనుగులో ముద్రింపరాదన్నాడు. తుది నిర్ణయం ప్రభుత్వంవారి చేతుల్లోవుంది. వారు మదరాసులోని సంఖ్యాధిక్యంగల జాతిఐన ఆంధ్రుల న్యాయపూర్వకవాంఛను మన్నిస్తారో- ఆంధ్రద్వేషి ఐన శ్రీ సత్యమూర్తి మాటను పాటించి డిమొక్రసీతత్వానికి విరుద్ధంగా వర్తిస్తారో వేచి చూడవలసివుంది.

**౨. విశాఖపట్టణ వైద్యకళాశాల 'ఆంధ్ర మెడికల్ కాలేజి' ఐంది :—**

విశాఖపట్టణంలోని వైద్యకళాశాలను ఆంధ్రమెడికల్‌కాలేజి అనే నామంతో వ్యవహరించడానికి ప్రభుత్వంవారు అంగీకరించడం ఆంధ్రావళికి ఆమోదకరమైన విషయం. ఇదివరకు ఏపేరుతో వ్యవహరింపబడుతూ వున్నా అది ఆంధ్రామెడికల్ కాలేజీయే. అది ఆంధ్రామెడికల్‌కాలేజీ కాబట్టే అరవవాడైన రాజన్ మంత్రి మదరాసుకోస్తాలో వైద్యశాఖామాత్యుడుగా వున్నప్పుడు దానిని సవతి బిడ్డగా చూస్తూ తగుమైన గ్రాంటులను ఈయకుండా అలయించాడు. ఆవైద్యకళాశాలభవితవ్యతాజీవితంలో ఏమూలనో

కొద్ది అదృష్టరేఖ వుండబట్టి ఆరాజన్‌మంత్రి ఉద్యోగపదవినుండి భ్రష్టుడు కావడం తటస్థించింది. అతడు తొలగిపోయాక ఆంధ్రవిశ్వవిద్యాలయోపాధ్యక్షులు ఆవైద్యకళాశాలను ఆంధ్ర మెడికల్ కాలేజీగా పేరు మార్చవలసిందిగా మదరాసు ప్రభుత్వంవారితో ఉత్తర ప్రత్యుత్తరాలు సల్పడం, అందులో కృతకృత్యుడు కావడం జరిగింది. పేరులో ఏముందని తోసి పారవేయదగ్గ విషయంకాదు. ఆంధ్రశబ్దం ఏదోరీతిని ఆమ్రోడితం కావడం ప్రస్తుతస్థితిలో ఎంతేనా కొరతగింది. మనం ఎక్కేరైళ్లు బెంగాల్ నాగపూర్‌వి, దక్షిణ మహారాష్ట్రపువి ఐ ఆంధ్రశబ్దానికి ఆస్కారంలేకుండా చేస్తున్నాయి. అందుచేతకూడా ఆంధ్రులంటే బయటి వాడికి తెలియకుండా పోతూవుంది. ఆంధ్రశబ్దంతో విశ్వవిద్యాలయం, వైద్యకళాశాల మున్నగు ప్రముఖ సంస్థలు వెలయడంకూడా మంచి ప్రచారమే అనే సంగతి ఆంధ్రు లిపుడైనా గ్రహింపవలసివుంది.

౬. వర్కింగు కమిటీలో మన పట్టాభికి స్థానం లేదు :—

త్రిపురి కాంగ్రెస్ అధ్యక్షుని ఎన్నికసందర్భంలో పట్టాభికోసమని తాన అభ్యర్థిత్వాన్ని ఉపసంహరించుకొన్న మౌలానా అబ్దుల్‌కలామ్ అజాద్ ఈయేడు అధ్యక్షుడై తన వర్కింగ్‌కమిటీలో పట్టాభికి స్థానమే లేకుండాచేశాడు. ఈయేటి కాంగ్రెస్ అధ్యక్షతకు మౌలానాను ఎన్నుకోమని సిఫారసుచేసిన మహాత్ముడు గత సంవత్సరం మన పట్టాభి విషయంలో ఆదిలో అనుచితమైన మౌనాన్ని వహించాడు. గతసంవత్సరం అధ్యక్షతకోసం పట్టాభికి పురిఎక్కించి ఆఖరికి తన రాష్ట్రపు ఓట్లేనా ఇప్పించక శల్యసారథ్యంచేసిన రాజాజీ ఈయేటి వర్కింగ్ కమిటీలో తాను దూరి పట్టాభిని స్థానభ్రష్టుణ్ణి చేయగలిగాడు. ఆంధ్రుడికి వర్కింగ్ కమిటీలో స్థానంలేకుండా చేసిన కాంగ్రెస్ పెద్దలకి ఆంధ్రోద్యమమంటే ఎంత ఆప్యాయత వుంటుందో మనం సులభంగానే ఊహించుకోవచ్చు. కాంగ్రెస్ అడుగడుగునా ఇట్లు మననెత్తిమీద శిలకొడుతూవున్నా మనం వెఱ్ఱి కుట్టెలమై ఇంకా కాంగ్రెస్‌మీద నక్క ఆశపెట్టుకుని వున్నాము. కాంగ్రెస్‌లో ఆంధ్రప్రతిపక్షులకున్న పలుకుబడి, చెల్లుబడి ఆంధ్రులకు లేదు. కాంగ్రెస్‌లో మనం వెట్టిచాకిరీ చేయడానికి తప్ప పెత్తనం వహించడానికి పనికిరాము. అట్టి సందర్భంలో కాంగ్రెస్‌నే నమ్ముకుని సర్వసంగపరిత్యాగంచేసి కూర్చోవడం ఆంధ్రులకు క్షేమంకరవిషయమేనా?

౭. శ్రీ వరదాచారిగారి చిల్లరవదరులు :—

మదరాసు మాజీపార్లమెంటరీ కార్యదర్శులలో శ్రీవార్కికి పిమ్మట శ్రీవరదాచార్యులవారినే రాజాజీ విశేషంగా ప్రేమిస్తూ వుండేవాడు. దానికి కారణం తాత తరంలో ఆంధ్రుడైన రాజాజీ తన తరంలో ఆంధ్రద్వేషాన్ని సంతరించుకొన్నట్లే శ్రీవరదాచారి తాను ఆంధ్రుడయ్యీ అరవల చంకల్లో దూరి ఆంధ్రద్వేషాన్ని అలవరుచుకోవడం. రాజాజీ మంత్రివర్గం అమల్లోవున్నంతకాలమూ ఆంధ్రవిశ్వవిద్యాలయాన్ని అరకంటితోనైనా చూచిన పాపాన్ని పోలేదు. ఆవిషయంలో ఇప్పటి గవర్నరుసలహాదారులే మేలనిపించారు. ఈయేటిబడ్జట్టులో ఆంధ్రవిశ్వవిద్యాలయానికి మూడున్నరలక్షలు గ్రాంటును ఇచ్చారు. ఇది రాజాజీఅనుచరుడైన శ్రీవరదాచారికి కన్నుకుట్టింది, అక్కసుపట్టలేక ఆంధ్రవిశ్వవిద్యాలయాన్ని ఆడిపోశాడు. ఆసందర్భంలోనే శ్రీవరదాచారి తాను ఆంధ్రుడనని చెప్పుకున్నాడు. తనజాతిని తిట్టినందుకు, తనజాతి సంస్థల్ని ఆడిపోసినందుకు ఆంధ్రుడనని చెప్పుకునే ఈ శ్రీవరదాచారి రాజాజీమెప్పులందితే అందవచ్చును. కాని ఆంధ్రులకు ఎంతమాత్రమూ ప్రియతముడు కానేరడు. అతనితోడి కార్యదర్శియైన బాపినీడు అతణ్ని

అర్థాంధ్రుడంటున్నాడు. శ్రీవరదాచారిలో ఆంధ్రభాగం అర్థభాగమే ఐతే మిగిలిన అర్థభాగం ఏ సాంకర్యంతోనో పూర్తి ఐవుండాలి. కాబట్టే ఇట్టిమాటలు శ్రీవరదాచారి ఆంధ్రవిశ్వవిద్యాలయాన్నిగురించి అనగలిగాడు. శ్రీవరదాచారి ఈవదరులను అతనితోడి మరి ఒక కార్యదర్శిఐన శ్రీ బి. యస్. మూర్తికూడా ఆలస్యంగా ఐనా తీవ్రంగా విమర్శించి వుండడం ఆంధ్రులకు సంతోషకర విషయం.—

**౬. తిరుపతిలో తమిళజాతీయుల అధికతర ప్రాబల్యః—**

రాబడిగల పెద్దదేవాలయాలు తమిళులకున్నన్ని ఆంధ్రులకులేవు. ఆంధ్రులకుగల పెద్దరాబడిగల గొప్పదేవాలయం ఒక్కటిరుపతిదేవాలయమే. ఐతే ఏమిసంబరం? ఆ తిరుపతిదేవాలయాన్ని అరవలు ఆచుకున్నారు, దోచుకుంటున్నారు. మనం దక్షిణదేశయాత్రలకువెళ్లి అరవలదేవాలయాల్లో డబ్బు పుష్కలంగా వెచ్చిస్తాము. అందులో ఒక్కకాసీకూడా తెనుగువారికిరాదు. ఇక మనదేవాలయమైన తిరుపతిడబ్బులో అరవలు ఎంతగుంజుకు పోతున్నారోలెక్కలేదు. ఓరియంటల్ సంస్థఅంటూపెట్టి అరవపండితులకు, అరవభాషకు తిరుపతి వెంకటేశ్వరులధనం చేరలకొలది పంచుతున్నారు. తిరుపతి ప్రాచ్యకళాశాలలో అఖరికి తెనుగువిద్వాన్ కోర్సులుఅయినాలేవు. ఆంధ్రభాషా సారస్వతాలకు ఎన్నోఅక్కరలువున్నవి. వానిఊసు ఎత్తేవారేతిరపతిలోలేరు. పైగా మనదేముడిడబ్బుతో అరవాన్నిఉద్ధరిస్తున్నారు. ఈతనకుమాలినధర్మం ఆంధ్రులు ఇకనైనా కట్టిపెట్టాలి. మనపండితులు, మననాయకులు ఈ విషయాన్ని ఇప్పుడిప్పుడే కొద్దిగా గమనిస్తున్నారు. తగుమైన ఆందోళన ఇంకాబయలుదేరలేదు. మనదేముడిడబ్బైనా మనకుదక్కేటట్లు చూసుకోవలసివుంది. లేకపోతే అరవలు మనదేవుణ్ణి, దేవుడిస్థలాన్ని తమలోకలిపివేసుకుంటారు.

**౬. జవహరిలాల్‌కు పట్టాభి పనికిరాలేదా?**

వర్కింగ్‌కమిటీలో మన పట్టాభికి స్థానంలేకపోవడానికి కారణం అనేకులు అనేకవిధాలుగా చెప్పుకుంటున్నారు. అందులో ఒక కాంగ్రెస్‌ప్రముఖుడు చెప్పే కింది విషయం గమనింపతగిందిగావుంది. వర్కింగ్ కమిటీలో పట్టాభిని వేయకూడదని జవహరిలాల్ ప్రత్యేకం పట్టుపట్టాడట. సుభాష్‌బోసుని ఎట్లాఐనా వర్కింగ్‌కమిటీలోకి తీసుకురావడానికి జవహరిలాల్ కుతూహలపడుతున్నాడట. అందుకోసం ఒకస్థానం ఖాలీగా వుంచారట. ఈవిషయం ఎంతవరకు నిజమో చెప్పలేము. జవహరిలాల్ వర్కింగ్‌కమిటీలోకి సుభాష్ బోసుని తీసుకువచ్చే విషయంలో ఎంతవరకు కృతకృత్యుడు అవుతాడో ఇప్పుడే చెప్పలేము. ఒక సంగతి మాత్రం నిష్కర్షగా చెప్పగలం. మన పట్టాభికిన్నీ, జవహరిలాల్‌కున్నూ ఎందుచేతనో చిరకాలంగా సరిపడదు. జవహరిలాల్ తండ్రిఐన మోతీలాలుకు పట్టాభికికూడా పడేదికాదు. పట్టాభిపట్ల తండ్రికిగల ప్రతికూలభావమే కొడుక్కికూడా సంక్రమించింది కాబోలు: స్టేట్ కాంగ్రెస్ ఉద్యమంలో జవహరుకంటె మన పట్టాభి ఎక్కువ ప్రగమనశీలతను ప్రదర్శించాడు. అందుతో ఆశాఖలో జవహరిలాలుకు పట్టాభి సమానమైన ఉజ్జీ, మంచి ప్రతిద్వంద్వి ఐనాడు. జవహరిలాలుకు ఆగుర్రు కొంత వుండవచ్చు. త్రిపురి కాంగ్రెస్ అధ్యక్షుని ఎన్నికల సందర్భంలో సుభాష్‌గెలుపు, పట్టాభిఓటమి విని జవహరిలాలు ఈక్రింది విధంగా స్టేట్‌మెంటు జారీ చేశాడు, 'ఈ ఎన్నిక రైట్‌వింగు, లెఫ్టువింగు విభేదాన్ని సూచించేదికాదు. ఇందులో పాల్గొన్న వ్యక్తుల హతుల్నిపట్టి గెలుపు ఓటములు నిర్ణీతములయ్యాయి' అంటే దీని అర్థం తాహతులో సుభాష్ కంటె ~భి తక్కువవాడు అనే కదా! పట్టాభి అంటే జవహరిలాలుకు తేలికభావం వుందని ఆనాడే తేలింది.

అయితే గతసారి వర్కింగ్ కమిటీ ఏర్పాటులో అతనికి చెయ్యిలేదు. అందుచేత ఆకమిటీలో పట్టాభిని కూడా వుండనిచ్చారు. ఈయేడు మౌలానా అజాద్ అధ్యక్షోపన్యాసాన్ని హిందీలోనుంచి ఇంగ్లీషులోకి అనువదించడమే కాకుండా జవహర్ వర్కింగ్ కమిటీనియామకంలోకూడా వేలుపెట్టాడు. ఫలితంగా పట్టాభికి వర్కింగ్ కమిటీలో స్థానం లేకపోయివుండవచ్చు. ఆంధ్రనాయకుడైన పట్టాభిపై ఇట్టి ప్రతికూలభావం భావి భారత భాగ్యవిధాత ఐన జవహర్‌లాలుకు వుండడం మనదురదృష్టమే. ప్రస్తుత భారత భాగ్యవిధాత ఐన మహాత్మునికి మన ప్రతికూలవర్గానికి చెందిన అరవలు వియ్యపుజాతివారై ఆంధ్రుల్ని అల్లంతదూరాన్న ఉంచగలుగుతున్నారు. మహాత్ముని తరువాత జవహరే భారతనాయకమణి కాగలడు. అతనికి ఆంధ్రుడంటె ఇంతటి అలవోకభావంవుండివుంటే దానిని తొలగించడానికి మనం ఇప్పడినించీ ప్రయత్నించాలి. లేకపోతే ముందుముందు మనకు ప్రబలనష్టాలు ప్రాప్తించి మన ప్రతిభ వినష్టమై పోతుంది.

# రాజ్యశ్రీ

[వచనరూపకము]

ఇందలి ప్రముఖ పాత్రలు :

రాజ్యశ్రీ : హర్షవర్ధనుని చెల్లెలు.
హర్షుడు : ప్రభాకరవర్ధనునికొడుకు.
రాజ్యవర్ధనుడు : హర్షవర్ధనుని అన్న.
ప్రభాకరవర్ధనుడు : స్థానేశ్వరమురాజు.
బాణుడు : హర్షవర్ధనుని ఆస్థానకవి.

రచయిత :

చిరుమామిళ్ల శివరామకృష్ణప్రసాద్, బి.యే.

## ప్రవేశిక

రాజ్యశ్రీ రాణకెక్కిన భారతరాజకుమారికలలో నొకతె.

కన్యాకుబ్జము రాజగు గృహవర్మ గృహిణి యామె.

శిలాదిత్యుడు గృహవర్మపై ఎత్తివచ్చి యుద్ధములో అతనిని సంహరించి అతనిభార్యయగు రాజ్యశ్రీని చెఱబట్టెను.

ఇంతలో ఆమెసోదరుడు రాజ్యవర్ధనుడు యుద్ధసన్నద్ధుడైవచ్చెను. అవిక్రాంతిలో రాజ్యవర్ధనుడు మరణించినను రాజశ్రీ తప్పించుకొనిపోయెను.

అనంతరము రాజ్యశ్రీ తన మరియొక సోదరుడైన హర్షవర్ధనునిచే పరిరక్షితయై పదిసెనిమిదేండ్ల బాలప్రాయమున బౌద్ధభిక్షురాలు అయ్యెను.

రాజశ్రీ గొప్పవిదుషి; రాజ్యాంగముల నెఱిగినప్రోడ. రాజ్యపాలనా విషయములందు అన్నకు చేదోడు వాదోడుగ ఉండునది.

ఆనాటి చీనారాయబారి హూయాన్‌త్సాంగు ఆమె ప్రజ్ఞాప్రాభవములను, దయాధర్మములను విశేషముగా కొనియాడి యున్నాడు.

రాజ్యశ్రీ ఈకథను ఆధారముగగొని నవ్యాంధ్ర రచయితలలో నాణెకాంద్ర వర్గమునకు చెందిన శ్రీచిఱుమామిళ్ళ శివరామకృష్ణప్రసాద్ గారు ఈవచనరూపకమును వెలయించినారు.

—సంపాదకుడు.

## అం ౧ - రం ౧

(సకలాభరణభూషితయై క్రొత్త పెండ్లికూతురు రాజ్యశ్రీ తలవంచి అన్నయగు హర్షవర్ధనునికడ నిలచియున్నది:)

హర్షుడు :

సోదరీ! మన చిన్ననాటి ఆటలు, పాటలు, ప్రశాంతజీవితము, నేటితో ముగియుచున్నవి.

రాజ్యశ్రీ :

ఇది, లోకమున ప్రతి స్త్రీకిని జీవితమునగల్గు మార్పులలో నొకటి. ఇట్టిది లేకున్న లోకవృత్తికి భంగము కలుగును. పుట్టినింటి నుండి ప్రథమమున మెట్టినింటికి ...టకు ప్రతివనితకును హృదయ...ంత వెనుకాడక పోవదు, కాని అట్లని ఎవరేని పుట్టినింటనే నిలచియున్నారా!

హర్షుడు :

నీ విజ్ఞానమును ఈపలుకులు విశదపరచుచున్నవి. చిన్ననాటి జీవితమొకింత మనసునబారి, నేనట్లంటినిగాని, లోకపుంబోకడుల నే నెఱుంగనా!

రాజ్యశ్రీ :

రాగరహితుడు, త్యాగి, అగు కణ్వుడు, పెంపుడు కుమార్తెయగు శకుంతలను మెట్టినింటికి బంపునపుడు కంటతడిపెట్టలేదా! మనవంటి వారి కిట్టి సమయములు దుఃఖమును రేపుననుటలో నాశ్చర్యమేమున్నది? నాయెడ నీకుగల నిర్మ

లానురాగమునకు నాకమితానందమగుచున్నది. నేను ధన్యురాలను. కలకాలము, భగవంతు డిట్టి యనురాగమునే మనయందు పెంపొందించును గాక! అన్నా! ఇక శలవుగైకొందును.

హర్షుడు :

దీర్ఘాయుష్మంతురాలవై, నీ భర్తయింట సుఖముల ననుభవింపుము. త్వరలో పుత్రవతివై వంశమును బలపరచి, భర్తచే ప్రేమింపబడుము. ఇక సత్వరము పయనముగమ్ము.

రాజ్యశ్రీ :

(అన్న పాదములంటి నమస్కరించి) సుఖములందేమి, కష్టములందేమి, నన్ను మఱువకుము; మనమొకరీతి తలంచుచుండ, దైవము వేరొకరీతి తలంచుచుండును. నాయందు సంపూర్ణానుగ్రహ ముంచవలయును. సెలవు పోయివచ్చెదను.

[ముత్తైదువులు, పాటలతో ముందు నడువ, రాజ్యశ్రీ గుమ్మము దాటి, వెలుపలకు వచ్చును.]

—తెర—

## అంక-రంగ (౧-౨)

(వృద్ధ నరపతియగు ప్రభాకరవర్ధను డొక మంచముపై పరుండియుండును; రాచనగరు సందడిలేక నిశ్శబ్దముగ నుండును :)

ప్రభా :

(నిరుత్సాహముతో) క్రుంకనున్న సూర్యుని కిరణములకు, మట్టమధ్యాహ్నమునందలి తీవ్రత ఎట్లుండును? – కనువిచ్చి కమ్మతావుల గుబాళించిన కుసుమము, కాలము గడచిన తరువాత తలవంచి ధరణి వ్రాలవలసినదే కదా! – ప్రపంచమున ఏజీవికిని ఈవృద్ధాప్యము తప్పదు. వెన్నెలవెంట చీకటివలె, పడుచుదనము వెంట ముసలితనము, ముసలక తప్పునా? ఇది సృష్టిరహస్యము. కొందరు వేరువిధమున తలంతురు. (అటునిటు చూచి) దినములిట్లే గడచుచున్నవి—ఎవరచ్చట?

భటుడు :

ఏమి శలవు ప్రభూ!

ప్రభా :

రాజ్యవర్ధనుని, హర్షవర్ధనుని పిలచుకొనిరమ్ము.

భటుడు :

చిత్తము. (నిష్క్రమించును),

ప్రభా :

(తలయూపి) ఈహృదయమునకింకను తృప్తిలేదు. చింత చచ్చినను పులుపు విరుగదు కదా! ఈ దేహమే జరాభరమున క్రుంగిపోయినదిగాని, ఈ ఆత్మ కింకను యౌవ్వన ప్రాదుర్భావమే!

[రాజ్య, హర్షవర్ధనులు ప్రవేశించి, నమస్కరింతురు.]

ప్రభా :

మీకు శుభమగును గాక! కూర్చుండుడు.

రాజ్య: హర్ష :

కూర్చుందురు,

ప్రభా :

కుమారులారా! కాలము గడచిపోవుచున్నది, నాదేహబలము, బుద్ధిబలము, సడలినవి. నేనింక విశ్రాంతి గైకొనదగిన సమయమిది. నాబాహుబలమున మీకీ విశాలసామ్రాజ్యము నార్జించి యొసగితిని. నాపాలనమునందన్యాయములేదని జనులయందొక సదభిప్రాయము కలదు. నేనీ లోకమున జన్మించినందులకు నావిధ్యుక్తధర్మమును సక్రమముగ నిర్వహించి ధన్యుడనైతినని నాకు తృప్తికలదు.—ఇక నా వైభవసూర్యుడు పడమరదిక్కునకు దిగుచున్నాడు. ఈసామ్రాజ్యమును చక్కదిద్దుకొని, మీ ప్రజలలో మంచి పేరు గడించుకొని మీ జీవితములను పునీతమొనరించుకొనవలసిన దినములివి. ఈనాటితో ఈవిపులసామ్రాజ్యమును మీభుజదండములపై నిడుచున్నాను. మీరింక వేటలతోడను, విందులతోడను కాలహరణ మొనరింపక, రాజ్యమును చక్కదిద్దుకొన ప్రయత్నింపుడు.

రాజ్య :

(వినయ మేపార) తండ్రీ! మీ పలుకులు మాకవిదితమగు హృదయసంచలనమును గల్గించుచున్నవి. మాపై మీరు మోపుచున్న భార మనల్పము. పాంచాలదేశమున, వాయవ్యప్రాంతమునందుండిన, హూణులను యుద్ధమున పరాభవించి హూణహరిణకేసరి యను అన్వర్థనామమును బడసిన మిమ్ము, మీపరాక్రమమును,

ర్చి నేను వేరుగ పలుక నక్కర లేదు, కాని...

ప్రభా :

రాజ్యవర్ధనా! నీ భావములను నే నెఱుంగుదును. నీవేదియో అనుమానించుచున్నావు. రిపులోకమును ముప్పదిసారులు అల్లడ తల్లడ పరచిన నాకడుపునబుట్టి ఇట్లు వెనుకాడతగునా?

రాజ్య :

స్వామి! నా కెందును వెఱపు లేదు. తామెందులకో నామాట కడ్డు వచ్చినారు!

ప్రభా :

ఎందులకా? నీ ఆలోచనలను, నేనెరింగి యుండుటచే.

రాజ్య :

అవి తమ కెట్లు తెలియవచ్చినవి?

ప్రభా :

తెలియుట కేమి! రాజుల కోటగోడలకు చెవులుండునని, నీ కెఱుక లేదా?

రాజ్య :

చిత్తము.

ప్రభా :

నీ ఆలోచనము లెట్లుండినను, అవి కార్యరూపమును పొందజాలవు. క్రాగిచల్లారిన ఈ రక్తమునకున్న వేగము నీకు లేదా? నీవేదో వేదాంతమున జిక్కుకొని యున్నావు, నీ వయస్సునకును, ఈ వేదాంతమునకును, ఎంతదూరమో ఆలోచించుకొనుము.

రాజ్య :

చిత్తము.

ప్రభా :

చిరకాలమునుండి, యుద్ధములయందు పాల్గొని, పగతుర చీల్చి చెండాడి, ఆకలనక, నిద్రనక, ప్రాణములపై తీపిలేక, కష్టించి, రక్తమును ధారవోసి, సంపాదించినదీ విపులసామ్రాజ్యము.—నేడు జవసత్వములు క్రుంగిపోయినవి. కాని నాకత్తి కింకను ఆకలితీరలేదు, నా యాత్మకింకను రాజ్యకాంక్ష చల్లారలేదు, నాకన్నుల కింకను మారణమహాయాగదృశ్యములపై మమత కొరవడలేదు. యువకుడవు; పాలవలె నీ యౌవ్వనము పొంగులు వారుచున్నది, ఇంకను చల్లని పలుకులేల? ఈ నిర్వీర్యప్రయత్నము లేల?—చూడుడు, నాబల మింకిపోయినదని, నాశౌర్యము క్రుంగిపోయినదని, నేడు హూణులు ఉత్తరపు సరిహద్దులకడకు, సర్వసేనలతో వచ్చి యున్నారు; నారాజ్యమును కబళింపజూచుచున్నారు! ఈకనులతో, ఈచెవులతో, ఈ దేహమున జీవములు నిలచియుండగనే, నేనార్జించిన ఈప్రాజ్య సామ్రాజ్యము శత్రువులచే అక్రమింపబడినదని, వినవలసిన దేనా? చూచి మిన్నకుండవలసిన దేనా?

రాజ్య :

తండ్రీ! నామనవిని ఆలింపుము. తమ యనుజ్ఞను నిర్వహింపవలసిన బాధ్యత మాపై గలదు; కాని, ఎచ్చటో ఉత్తరపు సరిహద్దులకడ హూణులు ఆందోళనముగావించిన నేమివచ్చెను? ప్రజలందరు జీవించుటకే గదా, సమదృష్టిగల భగవంతుడీ లోకమును సృష్టించినది. ఒకడే, సర్వమునకు రాజై, సర్వభోగముల ననుభవించుచు, సుఖముగా కాలము గడుపుటేల? మిగిలియున్నవారెల్లరు, పూటబత్తెము లేక, మలమల, ఆకలి సెగకు మాడుటేల? ఒకని కడ లక్షల కొలది ద్రవ్యము, వేరొకనికి సోలెడు గింజలు లేని దారిద్ర్యము!– రాజునకు రాజ్యకాంక్షగలిగిన, ఆకలిచే మలమల మాడువారే యుద్ధమున కేగవలయునా? రక్తమును ధారపోయవలయునా? ఆత్మార్పణ మొనరింపవలయునా?– కాళ్ళు తెగి, కన్నులు పోయి, చేతులువిరిగి, ఈనిర్భాగ్యులిట్లు అల్లాడుటేల? రాజ్యము విస్తరింపబడినదని రాజున కాసంతస మేల? కష్టపడువా డొకడు, కలిమి ననుభవించువాడు వేరొకడా? బవరమున పరాభవ మొకనికి, అపరంజి పళ్ళెరమున పాయసాన్నము వేరొకనికా? ఎచ్చటి ధర్మమిది? రాజునకు రాజ్యసంపాదనమేనా ధర్మము? తన సంపాదనాకాంక్షచే ఎందరు ఏకైకపుత్రులను గోల్పోయి, దిక్కులేనివారగుచున్నారో, పరువముగల వయసునందున్న పడతులెందరు పసుపు కుంకుమల గోల్పోయి, పలవించుచున్నారో, ఈ లోకమిట్లు, దుఃఖమయమై, దీనాలాపములతోడను, హాహారవముల

తోడను నిండియున్నదో ఆలింపరాదా! కన్నువిప్పి, నలుదిక్కుల కలయచూడరాదా !

ప్రభా :

(ఆలోచించి) రాజ్యవర్ధనా! నీ నామము నేతిబీరవంటి దైనది.—నీ యుపన్యాసమును విన్నాను. అది రాచకొలమువారికి అనుసరణయోగ్యమైనదికాదు, ఏవో గ్రంథములచదివి ఏకరువుపెట్టినావు. ఆలోచించుకొనుము. (హర్షవర్ధనుని గాంచి) హర్షా! నీ ఆశయము లెట్టివి ?

హర్ష :

(వినయముతో) మా అన్నయైనను మీయనుజ్ఞను జవదాటడు. తన అభిప్రాయమును నిర్భయముగ వెల్లడించినాడు: ప్రకృతమునకు తమ యనుజ్ఞను శిరసావహింపవలసిన బాధ్యత, మాయందు కలదు.

ప్రభా :

అట్లయిన, నాకోర్కెదీర్ప సిద్ధముగా నున్నారా ?

హర్ష :

(అన్నవైపుజూచుచు) సిద్ధముగనే యున్నారము.

ప్రభా :

రాజ్యవర్ధను డేమనుచున్నాడు.

రాజ్య :

తమ యనుజ్ఞను అనుసరించుట నాకు ప్రకృతము ధర్మము. తమ యాజ్ఞ ఎట్టిదేని కానిండు, శిరసావహింప సిద్ధముగా నున్నాను,

ప్రభా :

నీ ఆశయముల నీవరకే విని యున్నందున నీమాట కడ్డువచ్చితిని, కానిమ్ము, లోకమున అనుభవమును గడించుకొనలది, నీ కెఱుక లేకయే నీ ఆశయములు మార్పు చెందును. ప్రస్తుతము ఉత్తరపు సరిహద్దుల కడకేగెదవా ?

రాజ్య :

తమ యాజ్ఞ వెంట.

ప్రభా :

అటకేగునపుడు, హర్షవర్ధనుని కూడ వెంట గొనిపొమ్ము. కార్యనిర్వాహణమునకు పూనుకొనిన తరువాత వెనుకాడతగదు సుమా !

రాజ్య :

అదివేరే చెప్పవలయునా? నా ధర్మమును నేను క్రమముగ నిర్వహించెదను.

ప్రభా :

మంచిది. పోయిరండు. మిమ్ము ఈసారి వేరొకవిధమున జూడవలయును.

(రాజ్య, హర్షవర్ధనులు నమస్కరించి వెడలిపోయెదరు.)

ప్రభా :

(తనలో) కాలము మారుచున్నది. ఆశయములును మారుచున్నవి. రాజ్యవర్ధను డుద్రేకమునకు బానిస. ఆయుద్రేకమైనను క్షణభంగురమె! హర్షవర్ధనుడు నిజముగా హర్షవర్ధనుడే! రాజ్యవర్ధనుని శాంతబరచుట కతడు సమర్ధుడు. అందులకే వానిని వెంటబంపితిని.—ఎవరచ్చట ?

సేవ :

స్వామీ !

ప్రభా :

నాకు సాయమొనరింపరమ్ము.

(వానిపై చేయివైచి, మెల్లగా వెడలిపోవును.)

— తెర —

## అం ౨ - రం ౧

[అడవి. గుడారము, గుడారమునందచ్చటచ్చట కత్తులు, ఈటెలు, అమర్చబడియుండును. గుడారము వెలుపల హర్షవర్ధనుడు కూర్చుండి యుండును, వానికి సమీపమున మిత్రుడు బాణభట్టు, వేరొకయోధుడు కూర్చుండి యుందురు.]

హర్ష :

బాణభట్టారకా ! మానవ ప్రకృతి అతివిచిత్రము. ఒకనికుండు అభిప్రాయములు వేరొకని కుండవు; ఒకనికే, ఒకసమయమునందుండు అభిప్రాయములు వేరొకసమయమునందుండవు. గాలి తరగలవలె మానవుని చిత్తవృత్తి అతివిచిత్రముగ మారుచుండును.—నిన్న మొన్నటివరకు రక్తపాతమునకు భయపడిన సోదరుడు, ఈనాడు హూణులను పరాభవించి, అంతతో తృప్తిజెందక, మనలను ఇందే నిలచి యుండ నియోగించి, శత్రువులను తఱుముకొని పోయినాడు. సర్వసైన్యములు వాని వెంటనే నడచిపోయినవి: అలసిపోయెదనని కదా నన్ను తనవెంట రావలదని వారించినది ! ఎందున్నా

డో! ఏమిచేయుచున్నాడో!

బాణ :

హర్షవర్ధనా! వీరుడవగు నీకీ మేలుకేల? సోదరుడు కొలది గంటలలో రాగలడు. నీయందాతనికి గల ప్రేమబలమున, నిన్నిందు విశ్రాంతిగొన నియోగించి, ఒంటరిగ యుద్ధమున కేగినాడు. ఇట్టి సమయము లుండుననియే కద్దా, నేనును మీ వెంట వచ్చినది—ఏది, నీవనిన పలుకులలోని యర్థమును, నీకెంతవఱకు ఆపాదింపవచ్చునో తలంచితివా!

హర్ష :

కవి సర్వజ్ఞుడు, నీవు కవివి, నీవేమి తలంచుచున్నావో నే నెట్లు తెలుపగలను?

బాణ :

(నవ్వుచు) నేను కవినైన, నీవే సామాన్యుడవా! నీవు చక్రవర్తివి, కవివి, ... (పొరపాటభినయించి) చక్రవర్తి కొమరుడవు, కవివి.

హర్ష :

నాచిత్తవృత్తియందును, మార్పులు అకారణముగ వచ్చుననియేనా నీవు తలంచునది?

బాణ :

ఔను!

హర్ష :

మానవునకు మనసు మారకుండుట కష్టము. ఐనను, నాయందు నీవు గుర్తించినదేమి?

బాణ :

చెప్పవలయునా?



హర్ష :

కానిమ్ము.

బాణ :

నీచే రచియింపబడిన రత్నావళీ నాటకమున, నాంది శివపరముగా చెప్పబడినదేమి? తరువాత రచియింపబడిన నాగానందమున, నాంది బుద్ధపరముగా చెప్పబడినదేమి?

హర్ష :

మతము వెంట మనసుమారినది. నీ సమయస్ఫూర్తికి సంతసము కలిగినది.–బాణభట్టారకా! కవిత్వమునకేమి? నేడది అతిచులకనయైనది, నీ 'కాదంబరి'యు, నా 'నాగానందము'ను, ఒక వాఙ్మయముననే నెలసినవి, కాని అంతర మెంత లేదు!

# కవిత్వము

క. భావబంధురంబు భవ్యంబునైన స
త్కవిత రక్తమైన కాంత రీతి
నలరఁజేయు; కడు ప్రయాసతో నయ్యది
లబ్ధమైన నిష్ఫలంబ చూవె. 1

ఆ. యతుల ప్రాసములను నతికిన నగునె స
త్కావ్య మది రసప్రధాన మగుట
జీవరహితమైన కేవలదేహంబు
గాంచ సంతసంబు కల్గునొక్కొ? 2

క. రస మాత్మ కానఁ గావ్యా
భ్యసనంబునఁ దొలుత నేర్వవలయుఁ గవులకుఁ
రసపోషణ ముచితక్రియ
రసప్రధానములు కావ్యరాజము లగుటన్. 3

క. వినువారుఁ జదువువారును
గనిన ట్లానంద మొందఁగల రే కావ్యం
బును పఠియించిన నద్దా
నిని రసమయ మని యటండ్రు నెమ్మి దలిర్పన్. 4

ఆ. వివిధవర్ణములను వేర్వేఱ నుచితప్ర
కారమునను జిత్రకారుఁ డెట్లు
చేర్చి భావములను జిత్రించు నట్లు స
త్కవియుఁ దెల్పుఁ బదవితానమునను. 5

—గడ్డము కొండారెడ్డి.

బాణ :

కవిత్వము, కొలదిమంది సొమ్మని నేనొప్పుకొనను, ఒకవిషయమును గాంచినపుడు హృదయముప్పొంగినచో, దానిని పురస్కరించుకొని ఛందోబద్ధముగ నాల్గుపద్యములు కూర్చిన కవి ధన్యుడుకాడా! ఎందులకు రసవిహీనములగు వ్రాతలు, తలదిండ్లకు పనికివచ్చు పుస్తకములు.

హర్ష :

కావ్యము కళామయము. ద్రవ్యసంపాదనమునకై కావ్యముల సృష్టించినచో నది పూటకూలి ఇంటి భోజనమువలె రుచింపదు. మానవజాతిని ఉద్ధరించుట కన్ని విధముల కవి సమర్థుడు, ద్రవ్యార్జనమే పరమావధిగా తలంచు కవి లోకకళ్యాణమున కనువగు గ్రంథముల సృష్టింపనేరడు. ఆ లత, ఎందులకన్ని పూవుల వెలయింపజేసి, తీయని తావుల వెదజిమ్ముచున్నది! ఆ కోయిల ఎవరికొరకు, ఏలాభమునుగోరి, మృదువుగా గానము చేయుచున్నది ? విని సంతసించు రసికులకొరకు, తన్మయత్వమున తలలూపు ధన్యుల కొరకు. అట్లే కవి గానము చేయవలయును, స్వార్థమును మరువవలయును.

(కొలది దూరమున, 'ఎచ్చట', 'ఎచ్చట', అను కేకలు:)

హర్ష :

(ఆలించి) అది ఆర్తనాదమా?

(పరుగున నొకడు వచ్చి హర్షుని పాదములపై బడును.)

హర్ష :

ఏమి ? ఏల నన్నట్లు జూచుచున్నావు ? మాటాడవేమి? (క్రొత్తవానిని లేవతీసి కూర్చుండబెట్టును)

క్రొత్తవాడు :

(ఆత్రమున) మహారాజుగారు, ప్రమాదస్థితిలో నున్నారు.

హర్ష :

మహారాజుగారా !

క్రొత్త :

ఔను. జబ్బులోనున్నారు. రండు. రండు; నావెంట రండు.

హర్ష :

బాణభట్టారకా! ఇది కలయా?

బాణ :

భయమువలదు. వానిని నేనడిగెదను. (క్రొత్తవానినిచూచి) మహారాజుగారేమిచేయుచున్నారు ? ఎట్లున్నారు ?

క్రొత్త :

నన్ను మంత్రిగారు పరుగెత్తించినారు. రాజుగారికి రాత్రినుండి ఆయాసము – మాటలులేవు. ఆలస్యముచేయక రండు.

హర్ష :

ఇక మాకు చీకటి దినములు కాబోలు ! బాణభట్టారకా ! నీవిందేయుండుము. అన్నకై గుఱ్ఱమును పంపుము. నేను వెడలిపోవుచున్నాను. త్వరలో, అన్న, స్థానేశ్వరము చేరునట్లుప్రయత్నింపుము.

(నిష్క్రమించును)

తెర.

—సశేషము

## ఈమనోహరసమావేశాలు విస్మృతములైపోవుట విచారకరం

# జాతీయసమావేశాలు

"ఏది యెట్లయినను ఆంధ్రసోదరులు
ఈ రెండుజాతీయసమావేశములను
పునరుద్ధరించి దేశమునకు మాంగ
ళ్యమును సంఘటింప గోరెదను."

రచయిత :
శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి
(ప్రబుద్ధాంధ్ర సంపాదకులు)

శిథిలమైపోయిన జాతికి పునర్వికాసము గూర్పఁబూనినపుడు ముందుచేయవలసిన పని సంస్కరణమా? సముద్ధరణమా? యనిన రెండునూ అవసరములనియే తోఁచుచున్నది. దేశమునకు తటస్థించిన దౌర్భాగ్యదశ పరిపూర్ణమైనపుడు ప్రజలు ఎన్నటికి సంస్కరణాపేక్షలేని మంచి యాచారములను మఱచిపోవచ్చును. సముద్ధరణమే వానికి ముఖ్యమయినది. కొన్ని యాచారములను మఱచిపోవుటయే గాక యీకాలమున కవి పనికిరాకపోవచ్చును. వానివిషయమున సముద్ధరణమును, సంస్కరణమునుగూడ అవసరమగుచున్నది. ఆచరణమునందున్న యాచారములే కొన్ని యీకాలమునకు తగియుండక పోవచ్చును. వానిని సంస్కరింపవలెను.

ఆంధ్రజాతి నిన్న నేఁటిది గాదు. కొన్ని సమయములయందిది తన ప్రతిభను భారతదేశమునందంతటను విఖ్యాతపఱచినది గాని సామాన్యమైనది గూడ గాదు. అయితే యిప్పటి యీశైథిల్యమునకు కారణము జాతీయధర్మములును, జాతీయాచారములును సంకుచితములగుటయా? లేకున్న వానికి కాలవశమున తటస్థించిన వికృతియా?

ధర్మములును, ఆచారములును మంచివి గావని పూర్వపు సంఘనిర్మాతల మీఁద నాయాంధ్రసోదరులెవ్వరును రాళ్లు విసరరని తలఁచెదను. ఆంధ్రజాతి ఒక కాలమున మహోన్నతి నందుటకు ఏవి కారణములో అవి చెడ్డవి అగుట యెట్లు? అయితే జాతికి నేటి నికృష్టస్థితి యేల కలిగిన దనిన వాని యెడల దేశీయులకు పొడమిన ఔదాసీన్యమే కారణమని చెప్పెదను.

దేశమున అనేకాచారములు విలుప్తములైపోయినవి. అనేకములు విలుప్తప్రాయములై యున్నవి. మన చేతులతోడనే కొన్నిటిని జారవిడుచుచున్నాము. ఏదోయొక విధమున జాతియొక్క పునర్వికాసమును సాధించుటకు ఆంధ్రులు పూనుకొనినపుడు కొన్ని మంచి యాచారములు వినష్టములై పోవుచుండుట ఆశ్చర్యకరముగా నున్నది.

ఈసందర్భమున రెండు చిన్నజాతీయసమావేశములనుగుఱించి చెప్పెదను; సంఘము కండ్లుమూసికొని గడచిపోవుచున్న దనుటకు ఈసమావేశములయెడల పొడమిన ఔదాసీన్యము ప్రత్యక్షనిదర్శనమై యున్నది.

## వైశాఖపూజ

వైశాఖమాసము వసంతఋతువుయొక్క ఉత్తరభాగము. మాధవుని వైభవమునకు ముఖ్యచిహ్నములగు రకరకముల చూతఫలములు వైశాఖమున ముమ్మరముగా నుండును. చందనచర్చకు వసంతఋతువు చాల మంచిసమయము. వీవనల వినియోగముగూడ అవసరమైన సమయము. అట్టి యీవైశాఖమాసమున ఎన్నియో వందలయేండ్లనుండి నిన్న మొన్నటి వఱకును ఇప్పుడు మనము మఱచిపోయిన వైశాఖపూజ దేశీయులెల్లరును జేయుచుండెడివారు. ప్రతియూరునందే గాక ప్రతిబ్రాహ్మణుని యింటియందును ప్రతిక్షత్రియుని యింటియందును, ప్రతివైశ్యునియింటియందును, సరసమెఱింగిన ప్రతిశూద్రుని యింటియందును ఇది జరుగుచుండెడిది. ఇందులకై పొరుగూరి

పెద్దమనుష్యులనుగూడ పిలుచుకొనివచ్చెడివారు. నాబాల్యమున అనఁగా ఇరువది ఇరువదిరైదుసంవత్సరములకు పూర్వము నేను అనేకగ్రామములలో ఈవైశాఖపూజ చూచియున్నాను. దీనికి కుగ్రామము, పట్టణము అను భేదములేదు. ఇందులకు ముఖ్యములైన వీవనలు ఊరూరను దొరకును. మామిడిపండ్లు ఇంటింటికిని తెచ్చి యమ్ముదురు. మంచిగంధపుచెక్కలేని యిల్లు ద్విజులలో నుండనేయుండదు. ఎక్కడికక్కడనే తమలపాకులతోటలు సమీపమునందే యుండి తోటమోదలు సరసమైన వెలకు దొరకుచుండును. దేనికిని లోపములేదు; గాని శ్రద్ధకును, జాతీయాభిమానమునకును మాత్రమే తీరని లోపము కాన్పించుచున్నది. ఒక్కొక్క వ్యక్తికి మంచిగంధ మలఁది ఒక్కమాటు విసరి, వీవన చేతికిచ్చి, తాంబూలములో నుంచి ఘుమఘుమలాడు పసిఁడిమామిడిపండ్లు సమర్పించినపుడు పూజించినవారికిని, పూజింపఁబడినవారికినిగూడ కలిగెడు వసంతసుఖపారవశ్యము మహాకవుల వర్ణనమునకుఁగూడ స్వాధీనముకాని విషయము. అట్టి యీజాతీయసమావేశమును ఆంధ్రులు బొత్తిగా మఱచిపోవుట శోచనీయము.

## వనభోజనము

వసంతమున ఈవైశాఖపూజ అయిన తరువాత ఆంధ్రులకు ఇంత మనోహరమైన జాతీయసమావేశము శరదృతువులో ఏర్పఱుపఁబడినది. అదియే వనభోజనము.

ఉభయతారకమగు ఈసమావేశముగూడ మనము మఱచిపోవుట చాల అపకీర్తికరము. కార్తికమున శ్రీమన్నారాయణుఁడు క్షీరసాగరమునుండి వచ్చి మహాలక్ష్మితో గూడ ధాత్రీమూలమున (ఉసిరిచెట్టు మొదట) నివసించును. ఈ మాసమున ఉసిరిచెట్టు మూలమున శ్రీలక్ష్మీనారాయణులను పూజించి స్త్రీపురుషులు ఊరుబైటనున్న తోటలో చెట్లనీడలయందు సుఖాసీనులై ఆనందముతో భుజించుట చూచి ఎన్నిదినము లయినది? ఎంత చక్కని సమావేశమును మనము మఱచిపోయినాము?

నాబాల్యమున వనభోజనముచేయని గ్రామము లేకుండెడిది. ఇరుగుపొరుగు గ్రామముల పిన్నపెద్దలనుగూడ పిలుచుకొనివచ్చి పిండివంటలలో చెట్లక్రింద శ్రీహరిసాన్నిధ్యము గల్పించి అన్నము పెట్టుటకంటె ఆంధ్రులయొక్క గర్వమునకేమి మూలముగలదు? అట్టి యీ ప్రకృష్టసమావేశమును మఱచిపోయిన మనము "ఆంధ్రులు ముందంజవేయుచున్నా"రని గర్వపడుట యెందులకు?

కాలము తల్లక్రిందులుగా మాఱిపోవుచున్నట్లున్నది. శక్తి ననుసరించి చేయఁదగిన యీమనోహరసమావేశములు విస్మృతములైపోవుచుండుటకంటె విచారకరవిషయము లేదు. కాకినాడనగరమున జరిగిన ౩౮వ దేశీయ మహాజనసభకు ధరనిర్ణయము చేయుటకువచ్చెడి ప్రతినిధులగు దేశబంధువులకు అన్నమును విక్రయింపక మృష్టాన్నమును పెట్టి ఆంధ్రుల అతిథిపూజావ్రతమును నిలుపవలసినదని రామదాసు దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు దేశీయులకు విన్నవింపఁగా జాతీయోద్ధారకులని ప్రసిద్ధివహించిన కొండా వేంకటప్పయ్యపంతులుగారు "ఈవ్రాతలను ఖండింపవలసిన"దని పత్రికలలో టెలిగ్రాములు కురియించినారు. జాతీయోద్ధారకులని పిలువఁబడువారే జాతియొక్క పవిత్రతను నిలుపఁదగిన, నిలుపఁగల ఇట్టి మంచి సంకల్పములను త్రోసివైచినారనుట ఆంధ్రులకు లజ్జాకారణము గాదా?

ఏదియెట్లయినను ఆంధ్రసోదరులు ఈ రెండు జాతీయ సమావేశములను పునరుద్ధరించి దేశమునకు మాంగళ్యమును సంఘటింపఁగోరెదను.

# మణిమాల

## ఎల్లోరాగుహలలోని కైలాసమందిరం : గొప్ప శిలాప్రబంధం.

శిల్పకళా నైపుణ్యమునకు పేరువడసి భువనవిఖ్యాతిని వహించిన మందిరములు భారతదేశమునందలి అజంతాగుహలలో గలవని యందరికిని తెలిసినవిషయమే. ఆగుహలకు ఎనుబదిమైళ్ళ దూరమునందు నిజాము రాజ్యములోని 'ఎల్లోరా' గుహలుసైతము దర్శనీయములేయని వచించుటకు సంశయింపనక్కరలేదు. 'ఎల్లోరా' అని కాలక్రమమున మార్పు జెందినపేరు మొదట 'ఏలాపురము' అని వ్యవహరింపబడుచున్నట్లు ప్రాచీనదానపత్రములనుండి విదితమగుచున్నది. ఒకచోట,

'ఏలాపురాచల గతాద్భుతసన్నివేశం
యద్వీక్ష్య విస్మితవిమాన చరామరేంద్రాః
ఏతత్ స్వయంభుశివధామ నకృత్రిమే శ్రీ
ర్దృష్టేదృశీతి సతతం బహుచర్చయంతి.'

అని లిఖింపబడినది. దీనిభావము: 'ఏలాపురపర్వతములమీది మందిరములను దేవతలు విలోకించి విస్మితులై 'ఇది స్వయంభువమగు శివస్థానమే కాని మనుష్యనిర్మితములగు మందిరములకిట్టి యప్రతిమానశోభ కలుగ నేర్చునా?' యని నిత్యము వితర్కించుకొనుచుందురు.

'ఎల్లోరా' గుహలలో నిరుపమాన సౌందర్యమునకేమి యద్భుతశిల్పప్రావీణ్యమునకేమి మిన్నయని పేరుజెందినది 'కైలాసమందిరము'. సమస్తభారతవర్షమునందు దీనికి తులయైన కట్టడము గానరాదు. ధరాతలములోని యాశ్చర్యకర వస్తువులను ఏడింటిగ పూర్వపు బుద్ధిమంతులు గణించిరి. కాని దీనిని జూచిన యెడల అష్టమాశ్చర్యముగ దీనికి తప్పక వారు స్థానమొసంగియుందురు. 'ఎల్లోరా' గుహలలోని మందిరములు ముప్పది నాల్గు. వీనిలో దక్షిణదిశనుగల పండ్రెండును బౌద్ధమతసంప్రదాయమునకు సంబంధించినవి. ఉత్తరపుదిక్కునను న్న అయిదు గుహామందిరములును జైనమతస్థులచే నిర్మితములు. మధ్యగానుండు పదిహేడు మాత్రము హిందువులవి. ఈకట్టడములన్నిటికిని మకుటప్రాయమై యలరారు 'కైలాసమందిరమే' ఆగుహానిర్మాణముల ప్రస్తుతకీర్తికి ప్రధానకారణము.

ఈమందిర నిర్మాణవిషయమై యిదమిద్ధమని నిరూపించుటకు తగినప్రమాణములు మృగ్యములు, కాని ఆగుహానిర్మాణములలోని 'దశావతార' మని పిలువబడు మందిరమునం దొక శిలాలేఖనముగలదు. దానిలోని శ్లోక మిది:—

'దంతేనైవజిగాయవల్లభబలంయః సింధుదేశాధిపం
కాంచీశం సకళింగకోసలపతిం శ్రీశైలదేశేశ్వరం।
శేషాన్ మాళవలాట గుర్జరపతీ నన్యాంశ్చ నిత్యావశం
యః శ్రీవల్లభతాయవాపచరణం న్యస్యద్విషాం మస్తకే॥'

ఈసందర్భమున రాష్ట్రకూట వంశీకుడయిన 'దంతిదుర్గా'భిదానుని ప్రశంసకలదు. ఇతడు క్రీ. శ 725 సంవత్సరమునుండి 755 వరకు పరిపాలన మొనర్చినటు లూహింపబడుచున్నది. ఈనృపాలుడు ప్రతాపశాలియై సమస్తమహారాష్ట్రదేశమున కధిపతిగ ఉత్తరమున నర్మదానదీతీరము మొదలుకొని దక్షిణమున తుంగభద్రవరకుగల రాజ్యమును పాలించెను. ఇతనినిగురించి ప్రచారములోగల గాథ యిచట వివరింపబడుచున్నది. ఈనరపాలు డొకసారి తనరాజధానీనగరమగు 'మాన్యఖేటము'నుండి బయలుదేరి దక్షిణప్రాంతాధిపతియయిన చాళుక్యనరేశునిపయి దాడివెడలెను. ఆదండయాత్రలో 'బాదామీ' జిల్లాకు సంబంధించిన యొకస్థలమునం దాతడు విరూపాక్షమని పిలువబడెడి అతిసుందరమైన మందిరమును విలోకించెను. ఆమందిరమును చాళుక్యవంశీయుడగు రెండవ విక్రమాదిత్యుని పట్టమహిషి సుమారు 730 సంవత్సరప్రాంతమున కట్టించెను. దాని యప్రతిమానసౌందర్యమును గాంచి దంతిదుర్గుడు విస్మయాక్రాంతుడయి అట్టి మందిరమును 'ఎల్లోరా' గుహలో నిర్మింప సంకల్పించుకొని తనశిల్పుల కానతిచ్చెను. దానిపర్యవసానమే ప్రేక్షకులనుతన్మయులనుగావించు 'కైలాసమందిరము.'

కైలాసమందిరములోని చిత్తరువుల సౌందర్యము నిరుపమానము. పురాణప్రసిద్ధములగు దేవతావిగ్రహము లనేక

ములు గోడలపై చెక్కబడి పూర్వుల శిల్పవిద్యాచాతుర్యమును నేటికిని వేనోళ్ళ చాటుచున్నవి. వానిలో దుర్గ, కాళిక, లక్ష్మి, సరస్వతి, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల చిత్రములు ప్రశస్తములు. ఇవిగాక దేవతాప్రతిమలు, దైత్యుల చిత్రములు, గంధర్వులరూపములు, అప్సరసల మోహనాకారములు, ఋషిగణముల వైరాగ్యవిలసనములు పెక్కులు గానవచ్చుచున్నవి. ఒకచోట మృగేంద్రవాహినియై చండికాదేవి మహిషాసురుని మర్దించు దృశ్యము చిత్రింపబడినది. దానిసమీపముననే నందినధిరోహించిన మహాదేవునిపై అప్సరసాసమూహములు పుష్పవర్షమును గురిపించు చిత్రము నేత్రోత్సవము గావించుచున్నది. ఈవిధముగ కాళీయదమన మొకచోటను, పృథ్వీయుద్ధరణము గావించెడి వరాహభగవానుని గాథ యొకచోటను, నృసింహావతరణవృత్తాంతము మఱియొకచోటను, త్రిపురాసురసంహరణము సల్పెడి సదాశివుని విజృంభణము వేఱొకచోటను నయనానందకరముగ చెక్కబడినవి.

ఇట్టి మహాదాశ్చర్యకరమగు దృశ్యమును విలోకించి ఆంగ్లేయులు కొందఱు తమసంతసము కవితారూపమున వెలిబుచ్చిరి. కొందఱు దానిని ప్రపంచములోని అత్యుత్తమ 'శిలాప్రబంధము' 'The world's greatest rock - poem.' అని యుగ్గడించిరి. ధర్మముపేరిట భక్తిరసపూరితులై యిట్టి కట్టడముల నిర్మాణమునకు గడంగిన పూర్వనరేశ్వరుల జీవితములో కడుంగడు ధన్యములు. అట్టి మందిరములే పురాతన హైందవ విజ్ఞానమునకు ప్రబలనిదర్శనములై ఆర్యకళానైపుణ్యమున కాటపట్టులై పూర్వనాగరికతాప్రాభవమునకు స్మారకచిహ్నములై నేటిహైందవజాతీయులకు గర్వహేతువులుగ పరిగణింపదగియున్నవి.

—గోదావరి సత్యనారాయణ, బి.ఏ.

* * *

## చెన్నపట్టణం చరిత్ర : ఇంగ్లీషులోనూ, తెలుగులోనూ తక్షణమే ప్రకటించాలి.

చెన్నపట్టణం చరిత్ర వ్రాయించాలనీ, అందుకు మామిడిపూడి వెంకటరంగయ్యగారూ—భావరాజు వెంకటకృష్ణారావుగారు వగైరాలు కమిటీక్రింద ఏర్పడి పని చెయ్యాలనీ గుంటూరు ఆంధ్రసభలో తీర్మానం కావాలని పత్రికలలో ప్రస్తావనలు జరిగాయి. కాని ఆదేమీ కార్యరూపం ధరించినట్టు కనబడదు. కమిటీ స్టేజిలో నీళ్లుకార్చెయ్యడం మనకి మంచి సరదా—

చూడండి ముప్ఫయియేళ్లయినా మన నిఘంటువు ఆలాగేవుంది—4 ఏళ్లలో మద్రాసు యూనివర్సిటీవారు తమిళ నిఘంటువు పూర్తి చేసుకున్నారు. ఇలాగే తెనుగున శాస్త్రిలు సైన్సు పుస్తకాలూ వ్రాయించడానికి (Technical terms) కమిటీలు ఏర్పడడమూ నీళ్లుగారి హరించడమూ అయింది. యథామూషక మూషకః—అని మన తెనుగు సైన్సు అలాగే వుంది—

చెన్నపట్నం చరిత్రకూడా అలాగే- మనం వ్రాయిద్దామని అనుకుంటూనేవున్నాం; అప్పుడే అన్నామలై యూనివర్సిటీ ప్రొఫెసరు ఆ పుస్తకం వ్రాయడమూ, ముద్రించి, ప్రకటించడమూ కూడా జరిగింది. గునుపూడి జంగాలు తల్లికి ఇల్లుకట్టాలని పాతికేళ్లనుంచి అనుకుంటూవుండగా, కొంచెం ఓపికపట్టలేక వాళ్ళఅమ్మ తొందరపడి ఆయిల్లు ప్రారంభించకముందే కాలంజేసిందట—ఆంధ్రరాష్ట్రనిర్మాణవిషయంలో గునుపూడి జంగాల కీర్తి వామనుడులాగ పెరిగి ఆంధ్రలోకం అంతా ఆవరిస్తున్నది-

కమిటీవల్ల కార్యాలు సాధించబడవు. తెనుగుదేశంమీద అభిమానం వుండబట్టని ఆంధ్రపుత్రుడు పూనుకొని ఆపని చెయ్యవలసిందే—ఏడు లక్షల జనాభాగల చెన్నపట్నం ఆంధ్రులికి దక్కాలంటే దాని చరిత్ర యాథార్థంగా ప్రకటితం కావాలి—ఆ విషయమై బహుకాలం నుంచి బహుతీవ్రంగా పనిచేస్తున్నది "ఆంధ్రభూమి". సమగ్రమూ, సప్రమాణమూ అయిన చెన్నపట్టణ చరిత్ర గ్రంథరూపకంగా వ్రాయవలసిన బాధ్యత ఆంధ్ర శేషగిరిరావుగారిమీదవున్నది--ఆ పుస్తకం విరివిగాకొని చదివి అందులోగల విషయాలు చక్కగా వినియోగించుకొని ఆంధ్రరాష్ట్రం సాధించుకోవలసిన బాధ్యత ఆంధ్రులందరి దీని—ఇప్పటికే ఆలస్యంఅయింది. ఇంకా కాలహరణం చెయ్యకుండా పనిజరగాలి- కనుక తెనుగునా ఇంగ్లీషునాకూడా చెన్నపట్నం చరిత్ర గ్రంథరూపంగా ప్రకటించవలసినదని శేషగిరిరావుగారినీ, వారు ప్రకటించిన గ్రంథములు చక్కగాచదివి, మననంచేసుకొని రాష్ట్రం సాధించడానికి పూనుకొండని ఆంధ్రసోదరులను ప్రార్థిస్తున్నాను.

—'కాగడా' వారపత్రికలో
ఆంధ్రసేవకుడు.




## ఒంటెపుట్టుక

హిమాలయపర్వతశిఖరముమీద పక్షులకీ, జంతువులకీ ఒక దేవతుంటుంది. ఎప్పుడేనా ఏపశుపక్షులకైనా తగవులొస్తే ఆదేవతదగ్గిరకే వెళుతూంటాయి.

ఒకరోజు పొద్దున్నే గుర్రంవొకటి తన అపరిమితమైన మెడజూలుతోనూ, కొంచముచ్చుముఖంకంటే ఎక్కువ కోలగావుండే ముఖంతోటిన్నీ, నిక్కబొడుచుకున్న చెవుల్తోటిన్నీ, చెమటలు కారుతూన్న శరీరంతోటిన్నీ, ఎగురవేస్తూన్న జూలుకుచ్చుతోకతోటిన్నీ ఆదేవత దగ్గిరికెళ్లింది. వచ్చినకారణ మేమిటో అడిగింది దేవత.

గుర్రం చెప్పింది—'మారాజా! నాకీ శరీర సౌందర్యం నచ్చలేదు. ఈవొళ్లువల్ల అనేకకష్టాలకి గురికావలసివస్తోంది. నేడీ విషయమే, దేవరకి విన్నపంచేయటానికివచ్చా. ఆజ్ఞ అయితే...'

దేవత తలకాయ వూపింది. 'ఓ, తప్పకుండా చెప్పవచ్చు.'

ఇంక గుర్రం తనపురాణంసాగించింది. 'దేవా! నాకు నా మెడ బొత్తిగా బాగుండలేదు. అప్పుడప్పుడు ఈ కారణంవల్ల నాకు చాలా సిగ్గుపడవలసివస్తోంది. కాబట్టి, నామీద కాస్తంత దయవుంచి నామెడని హంసమెడలాగున దయచేయించండి, తమపేరు చెప్పుకుంటూ బతుకుతాను! ఇంక రెండోవిషయం మనవిచేసుకుంటున్నా—ఇంత చిన్నకాళ్లతోనే ఇంతవేగంగా పరుగెడుతున్నాగదా, ఇంకా పెద్దకాళ్లుంటే ఇంకా...

కాని, దైవమా! కాళ్లు పొడుగవటంవల్ల రొమ్ము చాలాచిన్నదిగా కనిపిస్తుంది; కాబట్టి దాన్నికూడా వెడల్పు చేయించండి.

అయ్యో, అసలు మాటమర్చిపోయినా! అన్నిటికన్నా ఎక్కువయిబ్బంది నావీపువల్ల కలుగుతోంది. వీపు సాఫుగా వుండటంవల్ల మనుష్యులు ఎప్పుడుపడితే అప్పుడు నామీద సవారిచేస్తున్నారు. కావున నాపై కృపవుంచి నావీపుమీద ఒకమూపురంకూడా దయచేయించండి. అదేనండి నా చిన్నమనవి.''

దేవతకి గుర్రం మాటమీద నవ్వొచ్చింది. మళ్లీ ఇంకోసారి ఆలోచించుకోమంది. కాని గుర్రం గంభీరంగా సకిలించి, 'అంతా ముందే ఆలోచించుకొన్నాను, ఇంక ఆలస్యంచేయించకుందురుగాక!' అంది.

దేవత మళ్లీ అంది—'సరే, నువ్వు చెప్పిన ప్రకారంగా నేను ఓజంతువుని పుట్టిస్తా. దాని స్వరూపం నీకు నచ్చితే నిన్నుకూడా అలాచేస్తాను.' అనిచెప్పి దేవత వెంటనే భూమిపైన మూడుసార్లు కాళ్లుకొట్టింది. మరుక్షణం చూసేప్పటికి అక్కడఒక జంతువు నించునివుంది. దాని వింతరూపం చూడతగ్గదే! పొడుగాటి నాలుగుకాళ్లూ, వెడల్పయిన ఛాతీ, నిటారుమెడ, అన్నిటికన్నా వింత మూపురం!

గుర్రం ఈవింతజంతువుని చూసి కంగారుతో 'అమ్మయ్యో, నేనీ భయంకర రూపం కోరటంలేదు. నన్ను క్షమించి యీజంతువునితక్షణ మిక్కణ్ణుంచి పారదోలండి.' అంది.

దేవత నవ్వి- 'ఇప్పుడదెట్లా సంభవం అవుతుంది? పుట్టింపబడినతరవాత భూమిమీద పడే తీరాలి కాబట్టి దీనికి ఒంటె అని పేరు పెడుతున్నాను' అంది.

అప్పుడు గుర్రం కంగారుపడుతూ వెళ్లిపోయింది.

ఇప్పటికీ ఒంటెనిచూస్తే గుర్రం బెదురుతూంటుంది!!

—శ్రీపాద సుందరమాణిక్యాంబ.




౧

ఇల్లాలుకూ—ధర్మపత్నికీ - సుమంగలికీ - ఏలోటూ లేకుండా షూటింగులు చురుగ్గా జరుగుతున్నాయి, ప్రతిబింబ ప్రతిఫలనాలూ - రూపసంస్కారాలు పూర్తిచేసుకొని తెలుగుసీమకు ఒక్కమారే ఒక్క ఆదర్శంతోనే తయారుఅవుతారేమో?

౨

కాలచక్రం ఆగడమూ లేదు నడవడమూ లేదు. కాని వాయువేగ మనోవేగాలతో తిరుగుతోందట. మధ్యరంగంలో ఆమంచర్లవారు అంతర్ధానమైనా పట్టాభిరాముని పట్టుదలా, రామగోపాలుని మేధాసంపత్తితోడు అవడంచేత ఆంధ్రజాతీయత నుజ్జీవింపజేసే జీవకళలతో పూర్వస్వరూపం దాల్చిందటగానీ, త్వరలో చక్రాన్ని తెలుగుభూమిలో త్రిప్పించి వీర శంఖం పూరిస్తే పట్టాభిరాముణ్ణి మాతృభూమి గౌరవిస్తుంది.

౩

మీరాబాయికి, తన్మయత్వంలో - యోగనిద్రలో - కృష్ణగాన రసతరంగిణీవిహారంలో - బృందా మనోహరదృశ్యాంతరాలలో—నిర్విఘ్నంగా—నిరభ్యంతరంగా షూటింగు జరిగిపోతోంది- కళామూర్తుల సంయోగంలో ప్రభవించే ఈ చిత్రం ఆంధ్రభూమిలో భక్తిప్రేమ రసానందబీజాలు తొలకరికే నాటుతుందని తలుస్తాం మేమూ.

౪

వీరవనితయైన చండికా - విలాసవతియైన విద్యాధరీ తెలుగు తెరమీదికి ఒకమారే యెక్కబోతున్నారు. అందులోనూ ఇందులోనూ నాయకులు వేరయినా నాయకిమాత్రం ఒక్కతే. ఒక్కచోట గగ్గయ్య సింహగర్జనాల్ని మించి గర్జించినదీ కన్నాంబే. ఇంకోచోట అద్దంకి గానమాధుర్యాన్ని మించి విలాసించిన దీ కన్నాంబే. ఆంధ్రులీ తారామణి విలాససౌందర్యంలో ముగ్ధులే అవుతారో? స్త్రీత్వంలోంచి విజృంభించే పౌరుషశక్తినే ఆరాధిస్తారో? చూడాలి. అది అధ్వర్యుల అదృష్టాన్ని బట్టి వుంటుందనుకుంటాం.

౫

కృష్ణవేణీ తరంగరంగాల్లో - నారాయణుడు జీవనజ్యోతిని వెలిగిస్తున్నాడు. అప్పారాయ నరేంద్రుని అధ్వర్యంలో ఏతత్కళారాధనం ఉపవాసవ్రతాది "సర్వనిష్టలతోనూ జరుగుతోంది. యాజ్ఞికులైన బ్రహ్మశ్రీ కామేశ్వర సోమయాజిగారు ఆంధ్రులకు ప్రసాద ప్ర

## షయాలు

దానం చేయించగలరట త్వరలోనే.

౬

భూకైలాసం శెట్టిగారి స్టూడియో మేడల్లో పార్వతీ పరమేశ్వరుల షూటింగు ప్రారంభమైంది. రావణుడు మండోదరికోసం విరహవేదన పడుతున్నాడు. ఈ కథ గాలిపురాణంనుంచి వచ్చిపడిందో, బ్రహ్మాండం బ్రద్దలై జారిపడిందో గాని అన్నిలోకాలూ ఇందులో కనిపిస్తాయిట! తమిళాంధ్ర కర్ణాట నటీనటవర్గం కలిసి తాండవించే ఈమిశ్రాంధ్రచిత్రం మద్రాసు సాంబారు రుచించేవారందరికీ రుచిస్తుంది. పురాణవిగ్రహాలకు బూజుపట్టకుండా ఈ నిర్మాణానికి పూనుకున్న "ప్రగతీపిక్చర్సు" వారికి స్వహస్తపాకులూ, వృద్ధవిశ్వస్తులూ ధన్యవాదా లర్పిస్తారు?

౭

మళ్ళీపెళ్ళి మంచిదా చెడ్డదా అని తర్కించారు కొందరు. మళ్ళీపెళ్ళికి మంచీచెడ్డా యేమిటి? అదో రకం వరద అని కొందరు నిర్ణయించారు. సృష్టికర్తకు కాంచనమూ దక్కింది- కాంచనమాలకు వన్నే వాసీ దక్కాయి. ఇంకా మంచిచెడ్డల విచారణమెందుకు? విమర్శకుల కాత్రిగాని.

౮

మైరావణుణ్ణి తెలుగు నేలకు దాడి పంపిన చిత్రపువారే దక్షాధ్వరధ్వంసానికి దారితీస్తున్నారట? పురాణ సాగరాల్ని పొంగించి భూలోకమంతా ముంచివేసేటట్లున్నారు వీరు. ఒహో! దక్షయజ్ఞంకూడా హిందీలో వుందికదూ? చేసిచూడడంకంటే చూచి చేయడం సులభంగా వుంటుందేమో? యజ్వలకు?

౯

ప్రాగ్జ్యోతీవారు "ఆకలిమంట" తీరినతర్వాతగాని "అప్పాజీ" ప్రారంభించరట? ఆకలిమంట దరిద్రనారాయణులది—అప్పాజీ ఆంధ్ర కర్ణాట సామ్రాజ్య కిరీట మణిప్రభా ప్రవర్ధనులది. ఆకలిమంట తీరితేనే కిరీటం ధరించడం సహజం కదూ?

౧౦

రాజాశాండోగారు "చూడామణి" షూటింగు ప్రారంభించారు ప్రాగ్జ్యోతీకాంతుల్లో, సినిమాకైపు నాళనాళాలకూ పట్టిన రాజాతర్షీతులో అంజనేయులూ, కల్యాణీ బాగా ప్రకాశిస్తారని నమ్ముతున్నాం. చూడామణి సంస్కృతపు పేరయినా సాంఘికచిత్రమే సుమండీ.

—V. R. T.

## మన కుక్కలసంగతి మీకేంతెలుసునని అలా తీసిపారేసున్నారు ?

# వెంకన్నతాత కుక్క

[నిజంగా జరిగిన కథ]

"ఆకుక్కని మావెంకన్నతాత భైరవుడూ అని పిలుస్తూ ఉండేవాడు ఎప్పుడూను. ఒకోసారి మావెంకన్నతాత పిలిచే ఆపిలుపులో ఏదో అపురూపం, అసామాన్యం- ఒకదాతని అర్థి పిలిచే దీనత్వం- ఒక రక్షకుణ్ణి రక్షితుడు పిలిచే కృతజ్ఞత- ఒక తండ్రి ప్రతిభావంతుడైన కొడుకుని పిల్చే గర్వంతోకూడిన వాత్సల్యం- యివన్నీ గోచరిస్తూ ఉండేవి."

రచయిత :

కోరుకొండ సత్యనారాయణ, బి.యే.,బి.ఎల్.

ఆనాడాదివారం. సాయంకాలం టిఫిన్ పట్టించి నాయరుకొట్లో నాలుగు కిళ్ళీలుకొని నములుకుంటూ మాయూనివర్సిటీక్లబ్బునుంచి చైనాబజారువరకూ వచ్చి ట్రిప్లికేన్ బస్సులో పడ్డాం- బీచ్చికి పోదామని- నేనూ, మావిఠ్ఠలూ, చౌదరీ, సోమనాథమున్నూ. నేనూ చౌదరీ ఎఫ్. యల్ చదువుతూఉన్నాం. విఠ్ఠల్ లిటరేచరుఆనర్సు ఫైనలియర్ చదువుతున్నాడు. సోమనాథం ఎకనమిక్సు డిప్లొమా కోర్సుకి చదువుతూ పరీక్షకొచ్చి నాకు గెస్టుగా ఉన్నాడు. అలా బస్సుదిగి ఎక్వేరియందగ్గర నడకపుచ్చుకుని ఇలియట్సురోడ్డుదాకా వెళ్లాం- అటుచూస్తూ ఇటుచూస్తూ ఆమాట యీమాట చెప్పుకుంటూను. అంతవరకూ వెళ్ళి అక్కడ ఇసుకలో దిగబడి నీటిఒడ్డుకు పోయి ఆఒడ్డున పడేసిఉన్న తెప్పలమీద కూచున్నాం- నేనూ, సోమనాథం ఒక తెప్పమీద; చౌదరీ, విఠలూ మరోకదానిమీద. అప్పటికి ఆరు, ఆరున్నర యిఉండొచ్చు. సూర్యుడప్పుడప్పుడే అస్తమిస్తూ ఉన్నాడు. త్రయోదశీ చంద్రుడింకా వెలవెలబోతూనే ఉన్నాడు వెలిమబ్బుతునకా అన్నట్టు, ఆకాశంమీద బారన్నర రెండుబారలకు పైగాను. మేమూ అలా ఒకటిరెండు నిముషాలు కూర్చుని ఉంటాం ఏమి ఉపక్రమించడానికీ తోచకుండాను. ఇంతట్లో ఆనీటిఒడ్డునే ఒకదొర, దొరసాని, వాళ్ళవెంట ఒక కుక్క మాకెదురుగానే నడచిపోతూ ఉన్నారు- కుక్క అని సామాన్యంగా అన్నానేగాని అదిమాత్రం కుక్కన్నా కుక్కగాదు. సాధారణంగా ఎప్పుడోగాని అల్లాంటి కుక్కలు మన కళ్ళబడుతూ ఉండవు. నల్లటి జపానుబ్లేక్‌ను మించిన రంగుతో ఒళ్ళంతా దట్టంగా కప్పేసిన బొచ్చు- నీలాల్లా మెరిసేకళ్లు- ఇంచుమించు ఒక అడుగు పొడవుంటయ్యా అన్నటున్న చెవులు- ఎగురుతూ, దుముకుతూ, చెవులు అల్లల్లాడిస్తూ, నాలుక వేలాడేస్తూ, నడకా పరుగూగాకుండా కదంతొక్కినట్టు కలకల్లాడుతూ పోతూన్న ఆగమన విలాసం, సాధారణంగా నేను నిలవబడితే నామొలబంటిదాకా వచ్చేటంత ఎత్తూ ఉన్న ఆకుక్కని తదేకదృష్టితో చూడకుండా ఉండలేక పోయ్యా- అది కనబడుతున్నంతవరకూనూ- అలాచూస్తూ నేనే మొదట చూచేవోయ్ చౌదరీ! దీని తస్సాదియ్యా ఎలా ఉందో

ఆకుక్క అన్నాను.

ఉండడమేమిటి- ప్రళయభైరవుడిలా ఉందిలేమరి. ఏ యేభైమంది బందిపోటు దొంగలనైనా సరే ఆకుక్కొక్కటే టకాయించి ఆపెయ్యగలదన్నమాట. అయినా కుక్కలంటే ఆదేశపు కుక్కల్లే మరి. ఇదిగూడా ఏన్యూఫౌండులాండుకుక్క అయిఉంటుంది. మనదేశంలో మచ్చుకి చూద్దామంటే దొరకదుగదా ఇలాంటికుక్క- అన్నీ ఊరకుక్కలే- చచ్చుకుక్కలే- ఉచ్ఛిష్టం తినుకుంటూ, అసహ్యమేసుకుంటూను అన్నాడు చౌదరి.

ఇంతలో మాసోమనాథం అందుకుని నిజమే కుక్కలంటే అక్కడివే కుక్కలు. వాటిప్రతిభే ప్రతిభ వాటిజాతే జాతి- ఆదేశాల్లో అవి ఎంతో సహాయంచేస్తూ ఉంటాయట మనుష్యులికి- ఒక వేటలో ఏమిటి, యుద్ధంలో ఏమిటి, దొంగల్ని డిటెక్టుచెయ్యడంలో ఏమిటి ఆలప్సు పర్వతాల్లో ఏటేటా చలికాలంలో ఎంతమందినో రక్షిస్తాయట. మంచులో కూరుకుపోయిన వాళ్ళని ఈకుక్కలు. అని యింకా ఏమిటేమిటో అనబోతూ ఉంటే యింతవరకూ పెదవి విప్పని మా విఠల్ ఒక్కసారి మేము ఉలిక్కిపడేటట్టు "చాల్లెండోయి మీ పొగడ్తలూ, మీరూను. మనదేశంలో నూటికి తొంభైమంది కిదోజబ్బు. స్వఅన్న ప్రతిదాన్ని నిరసించడం- పరఅన్న ప్రతిదాన్ని పొగిడెయ్యడమూనూ- ఒక ఆలోచనా- పాలోచనా లేకుండాను. మనదేశంలో కుక్కలసంగతి మీకేం తెలుసునని అలా తీసితీసి పారేస్తున్నారు. మన దేశంలో కుక్కల్నికూడా వాళ్ళలాగే జాతికొద్దీ ఏరి. శ్రద్ధగా జాగ్రత్తగా పెంచి- వేట మొదలయినవి ఏపనికి కావాలో ఆపనికి మప్పి అప్పుడవి వాటివిధి నిర్వర్తించలేకపోతే అనాలిగాని ఊరికే మంచీ, చెడ్డా లేకుండా విమర్శించెయ్యడమే. పైగా కొంచెం ఆలోచించా

[మిగతా ౩౧౪ పుటలో.

## మా యాజులుగారివంటివారు మీవూళ్లో కూడా వున్నారా?

# సర్వతోముఖయాజులు

"అయినప్పటికి యాజులుగారు మొగము విడకుండా ముక్తసరిగా స్వీకరించి 'సంతోషం! దానికేం లెండి' అంటూ వుండే వాడు."

రచయిత:

## బులుసు నరసింహము, బి.యే., బి.ఎల్.

౧

యాజులంటే యజ్ఞంచేసే రనుకుంటారు. కాని యజ్ఞాది క్రతువులు చేయకుండానే మన యాజులుగారికి బిరుదు లభ్యమైంది. మన యాజులుగారు యజ్ఞం చెయ్యకపోయినా ఆయనగారి పూర్వుల్లో ఒకరు సర్వతోముఖయాగము చేసిన సంగతి నిజము. ఆపూర్వీకుల పాండిత్యము లేకపోయినా వారి పేరుమాత్రం వంశపారంపర్యా మన యాజులుగారికి వచ్చింది.

యాజులుగారు మంచి కర్మిష్ఠి. ప్రతిదినము తెల్లవారుఝామున 4 గంటలకు లేచి స్నానం, సంధ్యా, జపము, తపము యథావిధిగా జరుపుతూ వుంటాడు.

ప్రస్తుత కాలమాన పరిస్థితులను బాగుగా గమనించి యాజులుగారు కొన్ని ప్రజ్ఞలు సంపాదించినారు. కొంచెం వైద్యము కొంచెం జ్యోతిషం, కొంచెం మంత్రశాస్త్రము, కొంచెం సాముద్రికము ఈరోజులలో జీవనోపాధికి చాలా సహాయపడతాయని యాజులుగారు చిన్నతనంలోనే గ్రహించారు.

ఉన్న మడిచెక్కలు నాలుగూ ఋణదాతలు యెగిరవేసుకొని పోగా యాజులుగారి స్వగ్రామమైన పాటిబండలో జీవనంచెయ్యడం దుర్భరమైపోయింది.

మనదేశంలో తిండికి, గుడ్డకు కొదవైనా సంతానానికి కొదువ లేదు. యాజులుగారికి ముప్పైఅయిదు సంవత్సరాలు మాత్రం అయినా ఆరుగురు పిల్లలు ఒకరి తరువాత వొకరు పుట్టుకొచ్చేరు. వీళ్ళని పోషించడానికీ, వీళ్ళ మందుమాకులకూ, పురుళ్ళకీ యాజులుగారి పూర్వార్జితపు భూములన్నీ అంతరించేయి.

సంసారం మెట్లీదడం అని దిగులొందుచున్న సమయములో యాజులగారి ప్రజ్ఞలు కొంత చేయూత యిచ్చాయి.

యాజులుగారి హస్తం అమృతహస్తమని గ్రామంలో మెల్లమెల్లగా పాకింది. ఎవరికి జబ్బుచేసినా యాజులుగారు చెయ్యిచూడాలి. చేతినాడెంలో ఆయనను మించిన వైద్యుడు లేడని గ్రామస్తుల నమ్మకము. పిల్లలవైద్యం, పెద్దలవైద్యం, స్త్రీలవైద్యం, పురుషులవైద్యం, భూతములవైద్యం, పిశాచములవైద్యం, అన్ని వైద్యములకు యాజులుగారికి పిలుపు తగులుతూ వుండేది.

తదనుగుణ్యముగా యాజులుగారు చికిత్సలు సాగిస్తూ వచ్చినారు. పిల్ల ఝడుసుకుందంటే యాజులుగారు మంత్రించిన విభూతి, పెద్దలకు జబ్బుచేస్తే యాజులుగారుఇచ్చిన మందుమాత్ర మెల్లమెల్లగా పని చేయడం ప్రారంభించాయి.

క్రొత్త యిల్లు కట్టాలంటే శంఖుస్థాపనముహూర్తము, అమ్మాయి పెద్దమనిషి అయిందంటే పునస్సంధాన ముహూర్తము, వివాహం తలపెడితే జాతకపరీక్షలు, ముహూర్త నిర్ణయములు అన్నీ యాజులుగారే ఏర్పాటు చేయ

వలసివుండెను !

అశుభం వచ్చిందంటే, మైలా! పక్షిణీయా! ఎన్నాళ్ళు! ఎన్ని రాత్రులు? అనే నిర్ణయాలు– కార్తులు యెప్పుడు ప్రవేశిస్తాయి– క్రొత్తదుక్కి దున్నాలంటే మంచినక్షత్రనిర్ణయాలు. అన్నీ, యాజులుగారి ముఖతః జరుగవలసిందే.

యాజులుగారికి ఊపిరి సలుపకుండా పనితగిలింది. ఇంతపని కలిగినప్పుడు యింకొకరైతే విసుగుకొని కసుళ్లు ప్రారంభిస్తారు. కాని యాజులుగారు మృదుభాషి. ఎప్పుడూ నవ్వుతూ విసుగుదలలేకుండాను, ఉన్ననూ పైకి వెలిబుచ్చకుండాను అందరికి అనుకూలమైన సలహాలు యిస్తూవుండేవారు.

యాజులుగా రింకొక రహస్యమును కనిపెట్టినారు. ఈ రోజులలో అన్నిపనులకు ఫీజులు యేర్పడ్డాయి. యాజులుగారు ఫీజు ఏర్పాటు చేస్తే వున్న ప్రతిబంధకములు పూర్తిగా గమనించినందున నోరు తెరచి ఎవరినీ యింత యివ్వండి, అంత యివ్వండి అని అడిగేవాడుకాదు. యాజులుగారివల్ల ఉపకారములు పొందేవారి ఇష్టమునకే అన్నీ వదలివేసేవాడు. ఫీజునిర్ణయిస్తే రూపాయి వచ్చేచోట యాజులుగారికి రెండు ముడుతూవుండేవి.

యాజులుగారిపేరు పాటిబండ చుట్టుప్రక్కలవుండే గ్రామాదులలోనేగాక మెల్లమెల్లగా తాలూకా అంతా ప్రాకింది.

౨

వెంకట్రావుపంతులు తాలూకా తహశీల్దారు. పదిహేను రూపాయిలనుండి పాతిక సంవత్సరాలకు ఈయనకు యీవుద్యోగం లభించింది. ఈయనతో గుమాస్తాగిరీ చేసినవారిలో కొందరు డిప్యూటీకలెక్టరుహోదాలో వున్నారు. ఆ అదృష్టం తనకుకూడా పట్టలేదని వెంకట్రావుపంతులుకు రాత్రింబగళ్లు మనోవేదన.

చిన్న ఉద్యోగాలు చేసినప్పటినుండీ కొద్దో, గొప్పో చెయ్యి తడిలేనిదే పంతులుగారు కాగితంమీద కలంపెట్టేవాడుకాదు.

పంతులుగారి భార్యకూడా ఈవుద్యోగంలో ఇంతా అంతా సహాయపడుతూ వుండేది. కాసులూ, రూపాయిలూ పంతులుగారు చూచుకుంటూవుంటే, బెల్లపుకుండలూ, చెరుకు పానకాలు ఇత్యాది యింటికి కావలసిన సామాగ్రి యావత్తు ఆమె చూచుకుంటూ వుండేది.

పంతులుగారిపేరు చెబితే 'ఆ లంచగొండితహశీల్దారుగారా!' అని అందరూ అంటూవుండేవారు.

ఈసంగతి ఒక శ్వేతముఖ ఉన్నతోద్యోగి చెవినిపడి పంతులుగారిని గురించి ఏదో రహస్యంగా వ్రాసి

పోయినాడు. అప్పటినుండి పంతులుగారి ప్రమోషను బంద్రైపోయింది. ఈయన ప్రవర్తననుగురించి రెండు మూడుసార్లు ఇంక్వైరీలు కూడా జరిగినప్పటికి, ఈయన కలవడిన విద్య పైవుద్యోగస్థులలో ఈయన జోటివాళ్ళపై ఉపయోగించి చావుతప్పి కన్ను లొట్టపడినట్లు ఉద్యోగాన్నిమాత్రం కాపాడుకున్నాడు.

ఆకష్టసమయములలో పంతులుగారు జపాలు, సూర్యనమస్కారాలు చేయిస్తూవుండేవారు. అర్జీలవల్ల ఉద్యోగాలు, ఆశీర్వచనాలవల్ల బిడ్డలు కలుగరని అందరికి తెలిసినవిషయమైననూ, పంతులుగారి వుద్యోగం వెండిచిప్పల దెబ్బలవల్ల ఊడకుండా నిలచిననూ పంతులుగారికి మాత్రం జపాలలో ఒక పిచ్చినమ్మకం కుదిరింది.

రైలులో ప్రయాణంచేసినప్పుడైనా ఎవరైనా సాముద్రికం తెలిసినవారున్నారంటే వారికి వెంటనే చెయ్యిచూపిస్తూ వుండడం- జ్యోతిష్కులున్నారంటే వారికి జాతకం చూపిస్తూ వుండడం- తమకు డిప్యూటీకలెక్టరీచేసే వ్రాత ఉన్నదా? లేదా! అని బాహాటంగా అడుగుతూవుండడం పంతులుగారికి పరిపాటైపోయింది.

ఒకనాడు పాటిబండదగ్గర నక్కపల్లిలో పంతులుగారు మకాం చేస్తుండగా సర్వతోముఖయాజులుగారి ప్రజ్ఞలను గురించి.పంతులుగారి ఆశ్రితులలో ఒకరైన కృష్ణశాస్త్రిగారు ప్రశంసించారు.

ఆరాత్రి పంతులుగారి వినోదార్థము కొన్ని ఏర్పాట్లు జరిగించబడివున్నను పంతులుగారు ఆరోజునైననూ పథ్యజీవనం చేయడానికి సమకట్టి ఆత్మత్యాగం చేసుకొని పాటిబండకు వెంటనే మకాం మార్చమన్నాడు.

క్రిష్ణశాస్త్రి పంతులుగారి రాకనుగురించి యాజులుగారి కెరుకచేసి మరుచటిదినం ఉదయము ఇద్దర్నీ సమావేశపరిచాడు.

"యాజులుగారూ! తమ యశఃకీర్తులు విని మేమే మీ ఊరువచ్చినాము. తమకు తెలియనిశాస్త్రం లేదని ప్రఖ్యాతి. "మా చెయ్యి ఒక్కసారి పరిశీలించండి." అని పంతులుగారు అరచేయి జాచినారు.

యాజులుగారు కొంతసేపు ఎగాదిగా చూచి "ఇంకొక ఆరునెలలలో కష్టాలన్ని తొలగిపోతాయి. కాని తగిన గ్రహశాంతికూడా జరగాలి." అని కొంచెం తలపంకించి"తమ జాతకం ఒకసారి ప్రసాదిస్తారా?" అని పంతులుగారివంక చిరునవ్వునవ్వుతూ చూచినాడు.

వెంటనే జేబులోనుండి పంతులుగారు జాతకంతీసి యాజులుగారికిచ్చినాడు. జాతకం చూస్తూ చూస్తూ యాజులు పట్టలేని నవ్వు, ఆనందం అభినయిస్తున్నాడు.

పంతులుగారు ఆతురతతో "యాజులుగారూ! జాతకం ఏమి చెబుతూంది." అని ప్రశ్నించాడు.

"ప్రశస్తమైన జాతకం. సాముద్రికం, జాతకం రెండూ సంపుటీచేసి చూస్తే నా అభిప్రాయం యింకా బలపడింది. తమరింకొక ఆరునెలలపాటు కష్టపడితే ఆపైన ఫెళ్ళున వెలుగుతుంది. అయితే ఆరునెలలు మాత్రం ధనవ్యయమని ఆలోచించకుండా నేను చెప్పిన ప్రకారం దానధర్మాలు. జపతపాలు మాత్రం జరిగించాలి" అన్నాడు.

"దానికేమి భాగ్యం అలాగే జరిగిద్దాం. కాని యాజులుగారూ! నేనొక్కవరం అడుగుతాను. కాదనరు కద" అంటూ తమ ఊరయిన కొల్లేటిలో శాస్త్రాలు తెలసిన సద్బ్రాహ్మణులు లేరు కాబట్టి యాజులుగారిని కుటుంబంతో తమ ఊరురమ్మని యాజులుగారి సంసారానికయ్యే ఖర్చు యావత్తూ తానే భరిస్తాననిన్నీ, ఇంకా తనతోటి ఉద్యోగస్థులకు, అధికార్లకు యాజులుగారి ప్రజ్ఞలనుగురించి సిఫార్సుచేసి. యాజులుగారికి మంచి ప్రాపకములు కుదురుస్తానని పంతులు ఆశపెట్టినాడు.

ఉన్నగ్రామంవదలి పట్నవాసం రావడం చాలా కష్టమని మున్ముందు యాజులుగారు సంకోచించినా చివరకు తహశీల్దారుగారి మాట త్రోసివేయలేక సరే అన్నాడు.

## ౩

యాజులుగారి అదృష్టవశాన్నే,

వెంకట్రావుగారి అదృష్టముపండో తహశీల్దారు ఇంటికివచ్చేసరికి కాకినాడలో హుజూరుసిరస్తాదారీ ఉద్యోగమైనట్టు వుత్తరువులు వచ్చాయి.

సంతోషము పట్టలేక వెంకట్రావుపంతులు యాజులుగారిని సకుటుంబ సపరివారముతో కాకినాడ తీసుకొనిరావడానికి తమ తాబేదారులలో ఒకరిని పాటిబండ పంపించారు.

సంసారం పెల్లగించుకొని యాజులుగారు మూడవనాడు కాకినాడ చేరారు. యాజులుగారు కొద్దిరోజులుమాత్రం కన్యకాపరమేశ్వరీ సత్రంలో వుండవలసివచ్చినా పంతులుగారి పలుకుబడివల్ల గ్రామంలో ఒక శ్రేష్ఠి అదివరకు పూజాపురస్కారములు లేక పాడడివున్న ఒక సత్రమును యాజులుగారికివసతి గృహముక్రింద ఏర్పాటుచేశాడు.

యాజులుగారికి కాకినాడ సముద్రపుగాలి బాగా భర్జించింది, సిరస్తాదారుగారికి గ్రహశాంతికొరకు వాసుదేవాలయంలో ప్రతినిత్యం జరిగే జపతపాలతోనూ, సూర్యనమస్కారాలతోనూ యాజులుగారిపేరు బాగా పైకివచ్చింది. సిరస్తాదారు గారిద్వారా కలెక్టరు రామారావుగారి యింటికీ, సబ్ జడ్జీ విశ్వనాధశాస్త్రి యింటికీ యాజులుగారికి ఆహ్వానములు వస్తూవుండేవి.

విశ్వనాధశాస్త్రికి రొంపపడితే ఆయనభార్యా సుబ్బలక్ష్మి పట్టుబట్టి యాజులుగారిని పిలిపించేది. రొంప మామూలుగా మూడురోజులలో తగ్గుతుంది. యాజులుగారి వైద్యం, జ్యోతిషం, సాముద్రికం, సూర్యనమస్కారాలు, యిత్యాది చికిత్సలుకూడా దోహదంచేస్తే వారంరోజులకైనా బాగుకాకేమవుతుంది ?

ఉన్నతోద్యోగుల మొగమాటాలు గొప్పమొగమాటాలు. యాజులు శ్రమకేమిస్తే బాగుంటుందని ఆలోచించి రూపాయియివ్వవలసినచోట 25 రూపాయలు చేతులో పెట్టేవారు.

అయినప్పటికి యాజులుగారు మొగము విడకుండా ముక్తసరిగా స్వీకరించి 'సంతోషం, దానికేంలెండి,' అంటూ వుండేవాడు. కాలవశమున సబ్ జడ్జీగారికి తిరిగీ రొంపపడితే యాజులుగారు రెండవ పిలుపుకు వెంటనే వెళ్ళేవాడుకాదు.

వృత్తి వొత్తిడివల్ల యాజులుగారు కొందరు అశిస్టెంట్లను ఏర్పాటుచేసుకున్నాడు— సాధారణపు పిలుపులకు వీరిలో యెవరినో ఒకరిని పంపుతూవుండేవాడు. యాజులుగారే రావలెనని పిలుపుమీద పిలుపు వచ్చినపిమ్మటగాని వెళ్ళేవాడుకాడు. సబ్ జడ్జీగారుకూడా యాజులుగారికి, లోగడ జబ్బు కుదిరినప్పుడు తగినట్టు ధనసత్కారం జరుగలేదేమో అని మనస్సులో బాధపడి యీమారు రు 25 లుకు బదులు రు 50 లు యిచ్చేవాడు. ఉద్దాంపండితులకు వార్షికాలు ఏర్పడినట్లు ఉన్నతోద్యోగుల యిండ్లలో యాజులుగారికి వార్షికాలేర్పడినవి.

డబ్బు అన్నివిధాలా వస్తూవున్న కొద్దీ యాజులుగారికి ధనకాంక్ష అతిక్రమించింది.

యాజులుగారి పేరు ప్రతిష్టలు విని వేదపండితులు తత్వవిశారదులు యాజులుగారి ఆతిధ్యమునకు వస్తూవుండేవారు. యాజులుగారి పలుకుబడి వీరికికూడా ఉపయోగిస్తూ వుండేది. వీరిని వెంటబెట్టుకొని ఆశ్రితశిఖామణి అయిన యాజులుగారు తమ ఆశ్రేయులతో చెప్పి వీరి ఉపన్యాసములకు కూడా ఏకన్యకాపరమేశ్వరి సత్రంలోనో, గ్రామంలోవున్న ఆలయాలల్లో ఏ వెంకటేశ్వరాలయములోనో, గోపాలస్వామి ఆలయంలోనో ఏర్పాట్లు చేయిస్తూ వుండేవారు.

ఎక్కడ పరమార్థాన్ని గురించి ఉపన్యశిస్తారన్నా స్త్రీ, పురుషులు తండోపతండములుగా జమకూడుతారు. ముఖ్యముగా స్త్రీలు, వారిలో మరీ ముఖ్యముగా వితంతువులు ఇట్టి అవకాశాలు పోగొట్టుకొనరు. పరమార్థశిక్ష కొలది, మాటలలో చెప్పవచ్చును. "ఈప్రపంచములో శాశ్వతసుఖమును అపేక్షించుట అసాధ్యముగాన ఐహికవాంఛలను త్యజించి పరమేశ్వరుని యెడల

అనన్యభక్తి కలిగి పవిత్రమగు భగవన్నామమును జపించీ, భగవత్స్వరూపమును ధ్యానించీ భగవంతుని బొంది, ముక్తి జెందుడ''ను మాటలలో పరమార్థశిక్ష అంతా ఇనుడ్చవచ్చును.

ఈశిక్ష భారతీయులకు ఉగ్గుపాలతో పెట్టబడినదని నానమ్మకము. తెల్లవారిలేచినది మొదలు ఏముష్టివాడి పాటలువిన్ననూ ఈ శిక్ష నే గ్రహించగలము. త్యాగరాయ కృతులలోనూ, యడ్ల రామదాసు కీర్తనలలోనూ, బ్రహ్మంగారి పాటలలోనూ, అధ్యాత్మరామాయణ వర్ణనలలోనూ గ్రహించగలిగితే మనకు కావలసిన పరమార్థ శిక్ష లేదూ!



అయినా పిన్నలూ, పెద్దలూ, స్త్రీలు, పురుషులు నెలలకొలది విసుగుదలలేకుండా ఉపన్యాసాలు వినుటకు ఈగలు మూగినట్లు మూగుతారు. ఉపన్యాసకులుకూడా, ఒక్కమాటకే చిలవలూ, పలవలూ ఏర్పర్చి ఘంటలకొలది ఉపన్యశిస్తూ శ్రోతలయొక్క. ప్రేక్షకులయొక్క మనస్సులు రంజింపజేస్తూ వుంటారు.

ఈ పరమార్థగోష్ఠి యింతటితో ఆగదు. భక్తిపారవశ్యమున ఉపన్యాసము వినుటకు వెళ్ళినప్పుడల్లా ఏదో పండో ఫలమో చేతబుచ్చుకొని వెళ్ళడం. యథాశక్తి దక్షిణ కూడా సమర్పిస్తూ వుండడం రివాజై పోయింది.

యాజులుగారు ఏర్పాటుచేయించే ఉపన్యాసకులకుకూడా ఈ మర్యాదలు జరుగుతూవుండేవి. అచ్చట పోగయ్యే పండ్లూ, ఫలాలు, పూలదండలు, ముఖ్యముగా డబ్బూ దస్కము, పోగుచేయుభారం యాజులుగారు తనమీద వేసుకుంటూ వుండేవారు.

అంత్యోపన్యాసంనాడు యాజులుగారు వూళ్ళోవున్న పెద్దలనందరినీ ముఖ్యముగా వైశ్యశిఖామణులలో డబ్బుగల శ్రేష్ఠి బృందమును స్వయముగా ఆహ్వానించి రప్పించేవాడు. ఉపన్యాసము ముగిసినపిదప ధనికులపేర్లు వరుసగా చదివి వీరింతా, వారింతా అని నూటపదహార్లకు నలుగురిలోనూ లిస్టు తయారుచేసేవాడు. లిస్టులు తయారవుతాయిగాని డబ్బు వసూలుకావడానికి చాలాకాలం పడుతుంది. ఈ వసూలుభారం యాజులుగారు తమమీద వేసుకొని తమ ఉపన్యాసకాతిథులను ఇంకొక ఊరు సిఫార్సు వుత్తరాలతో సాగనంపుతూ వుండేవాడు.

లిస్టుప్రకారం వసూలైనడబ్బు ఉపన్యాసకాలమందు పోగయిన డబ్బు అంతటికి ఉపన్యాసకులకు యాజులుగారే కాకులలెఖ్ఖ చెబుతూవుండేవారు.

సాధారణంగా యాజులుగారి అతిథులకు, యాజులుగారి అతిథిసత్కారమున్నూ దయాధర్మభిక్ష క్రింద యాజులుగారు వారికి ముట్టజెప్పే యేపాటిక, యాభైరూపాయిలున్నూ, సిఫార్సు వుత్తరమున్నూ మిగులుతూ వుండేవి.

తరువాతకూడా లెఖలను గురించి యాజులుగారున్నూ, వారి అతిథులున్నూ లక్కలుక్కలు పడుతూవుండేవారుగాని వాటితో బాహ్యప్రపంచకానికిసంబంధములేదు.

మా యాజులుగారివంటివారు మీవూళ్ళోకూడా ఉన్నారా

'ఇది ముక్కుపుడక కాదు. నా సోమరితనాన్ని పోగొట్టే అంకుశం.'

# ముక్కుపుడక

[చిన్నకథ]

'అమ్మా! మీ ఆయనతో చెప్ప బోకు, నేను నీకు ముక్కుపుడక చేయించి యిస్తా. నెల్లాళ్ళుమాత్రం నాకు గడువియ్యి.'

రచయిత :

## ద్రోణంరాజు నరసింహారావు

౧

'ఎన్నిసార్లో చెప్పాను—పరాయివాళ్ళ నగలు పెట్టుకో వద్దని, కాని నువ్వెందుకు వింటావు!'

రామశాస్త్రి పండితుడు. పాండిత్యంవల్లనే జీవనం గడుపుతూ వుండేవాడు. సరళమైన స్వభావం కలవాడు. కలవాడుమాత్రంకాదు; కాని అట్టే కష్టపడేవాడూ కాడు. కాలాన్నంతా భోజనంతోను, బాతాఖానీతోను గడిపేవాడు.

అతనిభార్య— చంచల. పేరుకు తగ్గట్టే గుణం కూడా. చాలా తెలివైనది. ఎంత కోపాన్నైనా సరే, ఒక్క చిరునవ్వుమాత్రాన కరిగించి వేసేది. మంచిమంచి బట్టలు కట్టుకోవాలనీ, నగలు పెట్టుకోవాలనీ ఉవ్విళ్లూరుతూ ఉండేది. కాని శాస్త్రి సోమరితనంవల్ల జీవనం గడవటమే కటాకటి అయిపోతూ వుంటే ఇంక నగలమాటా !!

ఒకనాడామె తనస్నేహితురాలి ముక్కుపుడక అడిగి తెచ్చింది, అటువంటిదే ఒకటి తనకుకూడా చేయించి పెట్టమని శాస్త్రికి చూపించడానికొచ్చింది. శాస్త్రి చూచి 'ఎన్నిసార్లో చెప్పాను- పరాయివాళ్ళ నగలు పెట్టుకో వద్దని, కాని నువ్వెందుకు వింటావు?' అన్నాడు.

చంచల 'నాకుకూడా ఇలాంటి ముక్కుపుడక చేయిస్తే వింటాను' అని చిరునవ్వొలికిస్తూ జవాబిచ్చింది.

'ఈమె చాలా పెంకిది, అల్లాటప్పాగా ఒదిలేది కాదురా' అనుకున్నాడు శాస్త్రి. తన తర్కశాస్త్రాన్ని సాయం తీసుకున్నాడు.

'రామ రామ, నీ వెంత అమాయకురాలవు! ముక్కుపుడకైతే చేయిస్తాను...కాని...' అన్నాడు.

'కానీ- గీనీ ఏమిటి?'

'అంతా కలికాలం!'

'అందరికీని— బీదవాళ్ళకీ, గొప్పవాళ్ళకీ కూడా.'

'ఓసి పిచ్చిదానా! గొప్పవాళ్ళ దగ్గర పెద్దపెద్ద ఇనపపెట్టె లున్నప్పటికీ, వాళ్ళ డబ్బుకే దొంగతనాలు వచ్చేటప్పుడు మనలాంటి బీదవాళ్ళ లెఖ్ఖేమిటి?'

'దానిని ముక్కుకు పెట్టుకునే ఉంటాగా.'

'అదింకా చెడ్డపని. నువ్వొక్కత్తివీ ఉండగా ఎవడైనా చూసి చప్పున చాకుతీసి నీముక్కు...'

'చాల్ చాలు. నేను వట్టిమాటలు వినదలచుకోలేదు. ప్రపంచంలో అందరి వద్దా బందిపోట్లే పడుతున్నాయా? అంతా నగల్లేకుండానే ఉంటున్నారూ? ఈ పోలీసువాళ్ళందరూ ఏమీ పనిలేకుండా ఊరికే ఈగల్ని చంపుకుంటూ, చేతులు నలుపుకుంటూ కునికిపాట్లు పడుతున్నారా ఏమిటి?'

'నీ కేం, నోటి కొచ్చిన దల్లా అంటూ వుంటావు. ముక్కుపుడక చేయించడంలో కష్టా లెన్నున్నాయో అనేమాట కాస్తైనా ఆలోచింపవు కదా! నీమాటే నీకు. ఇదిగో విను. మొదట బంగారం తీసుకొనేటప్పుడు మోసం ఉంటుంది. తరువాత కంసాలి కాస్తో కూస్తో కాజేసి రాగి కలిపేస్తాడు. పోనీ, ఎల్లాగో అల్లా ముక్కుపుడక చేయించుకుంటామే అనుకో. అది పెట్టుకున్నప్పుడు ఏదోంగాడయినా కన్నేశాడా అంటే సరి, ఇం కేమున్నది, ముక్కుపుడక్కి తిలోదకాలియ్యాలి సరేకదా—దానితోపాటు అప్పుడప్పుడు ప్రాణాలే ఎగురుతాయి. తెలిసిందీ?'

పాపం ఆమె తర్కశాస్త్రం - చదవడ మేమిటి, చూచిన పాపానైనా పోలేదంటే ఆశ్చర్యం లేదు. అందుచేత మాట్లాడకుండా ముకూ్కు, మూతీ ముడుచుకొని లోనికి వెళ్ళిపోయింది.

౨

భాద్రపదం జరుగుతో వున్నది. ఆవేళ పండుగ. స్త్రీ లందరూ బాగా సింగారించుకుని, శంకరునిపూజ చేద్దామని వెడుతున్నారు. చంచల మనస్థిమితం లేకుండా యింటికప్పువైపు రెప్ప వాల్చకుండా చూస్తూ ఉన్నది. తనకోరిక నెగ్గించుకోడానికి ఒక యుక్తి తోచినదో అన్నట్లు ఆమె మలినముఖంమీదకు హఠాత్తుగా ఒక చిన్ననవ్వు రేఖ పరుగెత్తుకొని వచ్చింది. వెంటనే ఆమె లేచి నిలబడింది. మంచిచీరె ఒకటి కట్టుకుని ఆస్నేహితురాలినే ముక్కుపుడక అడిగి తెచ్చి పెట్టుకుంది.

శాస్త్రి తన ఆశ్రమాలనుంచి ఇంటికి వచ్చాడు. పెళ్లాంముక్కునున్న ముక్కుపుడక చూశాడు! తక్షణం అతనిబుర్రలో ఒక పెద్దతుపాను చెలరేగింది. తలకాయ పట్టుకొని తలగడకు జేర్లబడ్డాడు! చాలా అలసి వచ్చాడని చంచల చూచి తొందరగా ఒక గ్లాసెడు చల్లని మంచినీరు తెచ్చి యిచ్చింది. "ఈ వేళ చాలా అలసి పోయారే!' అన్నది.

'అలసిపో లేదు, మండి పోయాను. నేను వద్దంటే నీవు యితరుల వస్తువు పెట్టుకొని కులుకుతూ ఉంటావు.'

'ఈవేళ పండగరోజు. నేను అమంగళంగా ఉండనా? ముక్కుకు కాడైనా లేదు! మెడలో పుస్తె తప్ప మరేమీ లేదే!! చెవులకు దుద్దు లయినా లేవు!!!'

శాస్త్రి ఊరుకున్నాడు.

'చూడండి, మన పొరుగింటి వెంకట్రావు పెళ్లానికి యెన్నినగలున్నాయో?' అని ఆమె మళ్ళీ అన్నది.

'అయితే మీ అమ్మతోనూ, నాన్నతోనూ చెప్పి వాళ్ల కోడలవే కావలసింది.' అని శాస్త్రి అరచాడు.

'కోప్పడతా రెందుకు?' అని చంచల కొంచెం కోపముతోనే జవాబిచ్చింది.

'కోపం కాదు, మీ అమ్మానాన్న నాలాంటి దరిద్రునికి నిన్ను పెళ్ళిచేసి చాలా తప్పు చేసేశారు.'

'శాస్త్రయినా సిగ్గు, భిడియాలు లేకుండా యెదురు నన్నే అంటున్నారా? మీరు గనుక కొంచెం యెక్కువ కష్టపడితే ఒకటి కాదు, యాభై ముక్కుపుడకలు యీలాంటివి చేయించగలరు.'

'నా చేతనయినది చేస్తున్నాను. శరీరాన్ని కష్టపెట్టి పని చెయ్యలేను. నామాట విను. ముక్కుపుడక తిరిగి యిచ్చి వెయ్యి. పోగొడితే ......!'

'పోగొడితే మీరే ఇచ్చుకోవాలి.' అని చెబుతూ పూజ చెయ్యడానికి చంచల వెళ్ళిపోయింది.

3

మర్నాడు శాస్త్రియింట్లో చాలా గందరగోళంగా ఉన్నది. శాస్త్రి, చంచల ఇద్దరూ యిటూఅటూ వెతుకుతున్నారు. గోడ మూలలు, ప్రక్కలు, ఇసుక, వడ్లకుండ, దేవుడిపీట అన్నీ గాలించేశారు; కాని యెక్కడా దొరకలేదు. శాస్త్రి వెతుకుతూ వెతుకుతూ నోటికొచ్చిన దల్లా అంటూ ఉండేవాడు. 'ఎవడొచ్చాడు? ఎక్కడ పెట్టావు? ఇప్పుడు మాటరాదు? దానిని పారవేసేస్తావని నేను మొదటే అనుకున్నాను. అనుకున్నట్లే అ

యింది. బ్రాహ్మల నోట్లో సరస్వతి ఉంటుంది. అందుచేతే భూతభవిష్యత్తంతా చెప్పేస్తారు వాళ్లు. ఎవరికీ యివ్వలేదు కదా? మళ్ళీ వాళ్ళది వాళ్లకే ఇచ్చివేయలేదు గదా? కాస్త జ్ఞాపకం చేసుకో!'

చంచల మెదలకుండా ఊరుకుంది విననిదానిమల్లే. వెతుకుతూనే ఉంది. ఇంతలో స్నేహితురాలు కాంతం వచ్చేసి 'ఏం, దొరికిందీ?' అని అడిగింది.

'లేదు' అని చంచల మెల్లగా, జాలిగా సమాధాన మిచ్చింది.

'బహుశా నీకు తిరిగి ఇచ్చివేసే ఉంటుంది. నువ్వు మరచిపోయి ఉంటావు. మీయిల్లుకూడా కొంచెం చూడు.' అన్నాడు శాస్త్రి.

కాంతం కొంచెము గట్టిగా 'బాగున్న దండోయి! మంచికిపోతే చెడ్డ ఎదురవస్తుం దంటారిదే కాబోలు. మీ రిచ్చే వాళ్లన్నా నేను లేదనేదాన్నినా? దాచుకున్నా ననుకున్నారా?' అని నాటంగా నాలుగూ పెట్టింది.

వాగ్బాణాల చురుకుపోటు బాగా తగిలింది. శాస్త్రి గాబరా పడ్డాడు. నెమ్మదిగా 'కాదమ్మా, తల్లీ! మాటవరుస కంటున్నా. అల్లా అవడంకూడా కద్దు' అని నసగడం మొదలుపెట్టాడు.

'అవు నవును, నాకూ తెలుసు. నేనుకూడా యింట్లో చూశా—కాని ముక్కుపుడక యెక్కడా దొరకలేదు. అసలిస్తేగా దొరికేందుకు! నాకు నాముక్కుపుడక కావాలి. లేకపోతే మాఆయన ఊరుకోరు.'

'అమ్మా! మీఆయనతో చెప్పబోకు. నేను నీకు ముక్కుపుడక చేయించి యిస్తా. నెల్లాళ్లుమాత్రం నాకు గడువియ్యి.' అంటూ శాస్త్రి బ్రతిమాలాడు.

౪

ఈ మధ్య శాస్త్రి చీకటితోనే లేచి శుభ్రంగా స్నానం వగైరాలు చేసి తన ఆశ్రమాలకు వెళ్లడం మొదలుపెట్టాడు. ఇంతకు మునుపు ఆవూళ్ళోనే తిరిగి తిరిగి ఎల్లాగో అల్లా తన కుటుంబాన్ని పోషించుకొనేవాడు, కాని ఇప్పుడు రెండు మూడు మైళ్ల దూరంలో ఉండే గ్రామాలకు కూడా పోయి చాలా ఆశ్రమాలు సంపాదించుకున్నాడు. అందుమూలంగా తనకు పూజ చేసుకోడానికూడా అవకాశం చిక్కడం లేదు. కష్టం చేయడం వల్ల అతని బొజ్జ కాస్తా కరిగిపోయింది. ముఖానికి కాంతి వచ్చింది. నెల గడిచింది. శాస్త్రిదగ్గర తన కుటుంబపోషణకు పోగా కొంచెం డబ్బు పోగయింది. రోజురోజూ పెరిగే చంద్రుడులా చంచలకు సంతోషం మనస్సులోనే పెరిగిపోతూ ఉంది.

'ఎన్ని రూపాయిలయాయి?' అని శాస్త్రి గంభీరంగా అడిగాడు. ఒక ముంతలోనుంచి రూపాయలు, కానులు మొదలయినవాటిని బోర్లించి 'ఒకటి, రెండు, మూడు!' అని చంచల లెక్కపెట్ట సాగింది.

శాస్త్రి శాంతంగా ఒక్క శ్వాస తీసుకున్నాడు తన అలస టంతా పోయిందో అన్నట్లు. 'సరే, నీస్నేహితురాల్ని పిలిచి ఆమెకు రూపా

యిలు కావాలో, ముక్కుపుడకే కావాలో? కనుక్కో' మన్నాడు.

✂

చంచల తనస్నేహితురాలయిన కాంతంతో ఇంట్లోకి వచ్చింది. వాళ్ళ నవ్వు అపుకొన్నా ఆగడం లేదు. చంచల పకపకా నవ్వేసింది.

చంచల అజాగ్రత్తవల్ల అనవసరమైన ఖర్చు శాస్త్రి నెత్తిమీదకు వచ్చి పడిందొకటి, అదీకాకుండా పక్కన నవ్వడం నిప్పుమీద నేయి వేసినట్లయింది. శాస్త్రి భగ్గు మన్నాడు. కళ్లు యెర్రజేసి, నోరు తెరచేసరికి అతని ఆశ్చర్యానికి మేర లేదు. ఎందుకంటే పోయిన ముక్కుపుడక చంచలముక్కునే ఉంది. చంచల నవ్వాపుకొని 'స్వామీ! క్షమించండి, ముక్కుపుడక నావద్దనే ఉంది. నేనే దానిని దాచివేసి, పోయిందని వంక పెట్టాను.' అంది.

శాస్త్రియొక్క విషాదంతో కూడుకున్న ఆమొగంమీద తన కష్టార్జితం మిగిలింది కదా అనే సంతోషం కనుపడింది.

'నీవు తెలివైనదానవు. కాని నీకపటము...?' అన్నాడు.

చంచల ఆమాట అడ్డగించి వినయంతో అతిమధురంగా చెప్పింది: 'స్వామీ! ఈ కపటవ్యవహారంవల్ల మన కెంతలాభం వచ్చిందో కొద్దిగా ఆలోచించి చూడండి. సౌఖ్యంగా మన జీవనం గడవాలంటే ఆ పరిశ్రమ మనకు చాలదు. ఈయువావస్థలో తేలికగా ఉన్న యీపరిశ్రమ ముసలితనం దాపరించినదంటే చాలా దుఃఖ పెడుతుంది. ఇప్పటి యీకఠినపరిశ్రమ ఆఖరు కాలంలో జీవనానికి పడకకుర్చీలా హాయిగా ఉంటుంది. స్వామీ! నా కిప్పుడు ముక్కుపుడక అక్కర లేదు. జీవితాన్ని సౌఖ్యవంతంగా చేయడానికి మీరు మీసుఖాన్నే వదలివేసి నపుడు నే నీమాత్రం చిన్నత్యాగానై నా చేయలేనా? తప్పకుండా చేస్తా.'

'కాదు కాదు, ఇప్పుడు నీకు తప్పక ముక్కుపుడక చేయిస్తా.' నంటూ ఉండగా శాస్త్రికంఠం సంతోషంతో నిండిపోయింది. కళ్ళల్లోనుంచి నీళ్ళచుక్కలు జలజల రాలాయి.

'సరే, అల్లాగైతే ఈరూపాయిలలో పదిరూపాయిలు పెట్టి మీకు బట్టలుకొనుక్కోండి. నా కొక ముక్కుపుడక చేయించిపెట్టండి. చాలు, దానితోనే సంతోషిస్తాను. మిగతా డబ్బు నేను దాస్తా' అంత చంచల.

'నీవు లక్ష్మివి, గృహలక్ష్మి పేరూ చంచలే. నీపేరూ చలే.' అంటూ శాస్త్రి ఆమెను కౌగిలించుకున్నాడు.

చంచల ముక్కుపుడక చేయించుకున్నది. శాస్త్రి దానిని చూచినప్పుడల్లా అతనిని పరిశ్రమకోసం ప్రేరేపించినట్లుండేది. 'ముక్కుపుడక కాదిది, నాసోమరితనాన్ని పోగొట్టే అంకుశం రా!' అనుకుంటూ ఉండేవాడు.

# వెంకన్న తాత కుక్క

(౩౦౭-వ పేజీ తరువాయి.)

గాంటే మన దేశంలో కూడా ఈ క్కలకి ఒకప్పుడు ఎంతో ప్రాఖ్యత, ఆదరణ ఉన్నట్టు- అవి తెంతో ఘనకార్యాలు చేసి ట్లూ కనబడుతుంది. వీరక్రమార్కుడి టయిములో ఒక వర్తకుడి ప్రాణం రక్షించినట్టు- అతడిని దాయాదులబారినుంచి కాపాడినట్టు ఒక కథగూడా ఉంది. అతడు దాన్ని బంగారుగొలుసుతో కట్టి పంచభక్ష్యాలు పెట్టి పెంచేవాడని కూడాను. ఇం తెందుకు? మన మనుచరిత్రలో పెద్దనగారి. వేటవర్ణనే సాక్షి. ఆకుక్కలకి ఆకాలపువారు పెట్టుకున్న ముద్దుపేరులే సాక్షి- ఆకాలంలో కుక్కలకుండే మర్యాదలే- వాటి ఆవశ్యకతకీ-వాటి యెడల మనవారు చూపే ఆదరానికీనూ. ఇప్పటికీ రాజుపాళయం క్షత్రియులదగ్గరున్న కుక్కలంటే మోజుపడనివారు- వాటి ఆకారం, వాటి ప్రతిభ మెచ్చుకోనివారు లేరు గదా! ఇప్పటికీ మనదేశంలో ముఖ్యంగా మన తెలుగునాడులో అల్లాంటి ఉత్తమజాతికి చెందిన కుక్కలున్నాయని నా నమ్మకం.

అయితే అవి క్రమంగా నశించిపోతూ ఉండొచ్చు- మన ప్రాలుమాలికవల్ల అశ్రద్ధవల్లానూ. ఇం తెందుకు? నేను విన్నసంగతొకటి చెబుతా వినండి ఈ సందర్భంలో.

నేను వినడమేగాదు మరి ఆకుక్కని నాకళ్ళతో చూచాను కూడాను అన్నాడు- అయితే చెప్పరా అన్నాం ఏకకంఠంతో- ఏమంటే ఏదన్నా చెప్పాలంటే మావిరలే చెప్పాలి- కూర్చున్నవాళ్ళు లేవకుండా వేళాపాళకూడా తెలియనియ్యకుండా చెప్పేవాడు. అంతా విన్నాక వాడు చెప్పింది కథా, నిజమా అనిపించేది. వాడు ఏదిచెప్పినా రెండిటికి తేడా తెలిసేదికాదు. అట్టివిరల్ ఇప్పుడు అలా మామా టందివుచ్చుకుని యిలా మొదలెట్టాడు.

"ఇప్పటికి సుమారయిదారేళ్ళయి ఉంటుంది. అప్పుడు నేను స్కూలుపైనలు చదువుతూ ఉండేవాణ్ణి, రాజమండ్రీ వీరేశలింగంగారి హైస్కూలో, మాపెద్దమ్మగారింట్లో భోంచేస్తూను. మానాన్నగారు అప్పటికయిదారేళ్ళుగా అడ్డదీగలలో పారెస్టురేంజరుగా ఉంటున్నారు. నేను క్రిస్టమసుకి ఆఏడు ఇంటికెళ్ళి పండగెళ్ళేదాకా, సెలవులున్నయి గదా అన్నీ అక్కడే ఉండిపోయాను. అడ్డదీగలంటే ఆచుట్టుపట్ల మన్యానికంతా మహాపట్నమన్నమాట. యెల్లవరం తాలూ

---

# త్రిలింగజననీ దివ్యపతాకం

రారేలా - రారేలా
ఆర్ధ్రుం లింకా - రారేలా
స్వతంత్రలోకం గనరేలా !
జననీదాస్య శ్శృంఖలయుగళము
ఛేదింపని మనబ్రతుకేలా
మగబ్రతుకేలా
కాకతివీరుల కత్తులతళతళ
తెలుగుగుండెలే మరచినవా
రారేలా - రారేలా
... ... ...
తెలుగుసింగముల తీవ్రగర్జనాల్
దిగంతములమూర్ర్మోగినవే.
గణగణగణమను ఘంటారవములు
దేవతలను మేల్కొల్పినవే
రారేలా - రారేలా-
... ... ...
త్రిలింగ జననీ దివ్యపతాకం
తెలుగుకోటలో నిల్పుటకే
తెలుగుపౌరుషం చూపుటకే
తెలుగుజాతి నిర్మించుటకే
రండీ ఆంధ్రులు
లెండీ వీరులు
మీసందువ్వే - మగవారంతా
రోసంజూపే - నరపతులంతా
లెండీ రండీ - ఈ-నా-డే
జై - జై - జై.

[illegible signature]

కా తాహశ్శీలుదారూ మొదలయియినవాళ్ళంతా అక్కడే ఉంటూ ఉంటారు. మన్యానికి వెల్లడికీ మధ్య వర్తకమంతా ఏలేశ్వరం తప్పిస్తే అక్కడే విస్తారంజరుగుతూ ఉంటుందని చెప్పాలి. వెల్లడినుంచి వెళ్ళిన మన్యపు వర్తకులుగూడా చాలామంది స్థిరపడిపోయారక్కడ- ఆకొండగాలికి, ఆవాగుసీటికి, ఆమన్యపు జ్వరానికి అలవాటుపడిపోయి. అల్లాంటివాళ్ళల్లో ఒకడు మావెంకన్నదొర. వెంకన్నదొర ఏదో సామాన్యసంసారి- తనకు కొండవంచనున్న 10, 12 ఎకరాల కొండ్రచేసుకుంటూ దానితోపాటు కలపవర్తకంకూడా చేస్తూ ఉండేవాడు. వెంకన్నదొరకి అప్పటికి ఒక 50 ఏళ్లుంటాయి- ఏ... ముసలాడుగా కనపడకపోయి... టికీ మేముమాత్రం—నేనూ, ... తమ్ముడూనూ - వెంకన్నతా... అంటూ ఉండేవాళ్ళం- వేరేవరస దొరక్క, వెంకన్నతాత మిద్దెవేసిన తాటాకిల్లు మాబంగళా కెదురుగానే ఉండటం మూలాన్న- మానాన్నగారి దగ్గిర కతడు తరచు కలపవ్యాపారం విషయంలో వస్తూఉండడంచేత- మేము అతడి మనుమళ్ళతో (కూతురుకొడుకుల్తో) ఏదో కలసి మెలసి ఆడుకోవడంచేత- వాళ్ళతోపాటు కలిపి-మాకూ, వెంకన్నతాత రాత్రిళ్ళు ఆకథ, ఈకథ- ఆకోయదొర ప్రతాపం, ఈకొండదొర పితూరీ- ఇలాంటివి చెపుతూ ఉంటంమూలాన్న- వెంకన్నతాతంటే మాకు చాలా చనువు స్వాతంత్ర్యం ఏర్పడినయి. ఇంతకీ చెప్పొచ్చే అసలు సంగతేమిటంటే- మా వెంకన్నతాతదగ్గిర మాంచి బారీ వేటకుక్కొకటుండేది- నేను చెప్పే నాటి కది బాగా ముసలిదయిపోయింది లెండి- అయినా అప్పటికీ దాన్ని చూస్తే మాకు చాలా భయమేసీది- దానిదగ్గి రెవరూ మనిషి లేకపోతే ఆ గుమ్మంలో అడుగుపెట్టడానికి భయంగా ఉండేది. సాధారణంగా అది బాచారని బా

# ఆంధ్రుడు

అందరు ముందుకు ఉరకలు పెడుతూ
అందరు పై పైకెగురుచు నుంటే
ఆంధ్రుండ చటనె అగాడేమీ?
ఆంధ్రుడు ముందుకు సాగడదేమి?

ఉడికే నెత్తురు—ఉబికే కండలు
గాఢాఘాతములోర్చే శక్తీ
ఆంధ్రుని తనువున లేవా?

మరిగే మనసూ- కరిగే హృదయం
విషమసమయముల విచక్షణమ్ము
ఆంధ్రుని లోపల లేవా?

కాల్చే తేజం- చీల్చే జ్ఞానం
విజయముగొనగల విజ్ఞానం
ఆంధ్రునివ్యక్తిని లేవా?

అమృతము చిలికే- తేనెలు ఒలికే
భావవీధిను త్తేజము జేసే
కవికోకిలములు లేరా?

అనిమొనకంపే- విధి బోధించే
పతినైనను పరుషోక్తు లుపలికే
వీరపత్నులే లేరా
(నేడా ధీరపత్నులే లేరా?)

అహరహమ్మును- అరువదిగడియలు
కాయముదాచక కష్టించే
మన ఆంధ్రకర్షకులు లేరా?

కుడిచిన కూడూ- త్రాగిన గంజీ
నీరై పారగ స్వసుఖము లెరుగక
చెమటలనోడ్చే కార్మికబృందము లేదా?

భారతఖండం- బంధవిముక్తికి
భోగభాగ్యముల బుగ్గినిబోసి
కౌపీనంబులె గతిగా బ్రతికే
త్యాగమూర్తులే లేరా?

వేదాంతమ్మున- వైదుష్యమునకు
ఖండఖండముల ఖ్యాతినిబడసిన
ఖండాంతరముల జ్ఞానముజల్లే
మేధాయుత్తులు లేరా?

అంతయు లేనీ- అంతరాళమున
పరువులువెట్టే ప్రచండతేజం
పరమరహస్యం భేదించిన
పటుశాస్త్రవేత్తలే లేరా?

సామ్రాజమ్ముల- సృష్టినిలిజేసి
సామ్రాజ్యమ్ములు- పుష్టిగజేసి
సామ్రాజ్యములోక- ప్రజ్ఞతో నేలిన
అఖండప్రతిభులు లేరా
(నేడా అఖండప్రతిభులు లేరా)

తెలుంగు కత్తీ తీక్ష్ణదీధితులు
ఆంధ్రునిశత్రుల అంధులజేయగ
రణమ్ముజేసిన- రణశూరులు లేరా
(నేడారణధీరులు లేరా)

-కోరుకొండ సత్యనారాయణ, బి.యే., బి.ఎల్.

రేమో పోడుగుందా అనిపించేది- లేచి అది ఒక్కసారి ఒళ్ళుసాచుకుంటేను. దానినడుము నాగుప్పెట్లో యిమిడిపోద్దేమో చూద్దామనుకునేవాణ్ణిగాని దానిదగ్గిరకెళ్ళడానికి ధైర్యంచాలేదికాదు- మూతిచాలా సన్నమేగాని నోరుతెరిస్తే మాత్రం నాతలకాయ దూరిపోతుంది. కళ్లు మిలమిల మెరుస్తూ ఆముసిలితనంలోనే ఎంతో కాంతివంతంగా ఉండేవి- ఆకుక్కని మా వెంకన్నతాత భైరవుడూ అని పిలుస్తూ ఉండేవాడు ఎప్పుడూను. ఒకోసారి మా వెంకన్నతాత పిలిచే ఆపిలుపులో- ఏదో అపురూపం, అసామాన్యం- ఒకదాతని అర్థిపిల్చే దీనత్వం- ఒక రక్షకుణ్ణి రక్షితుడు పిలిచే కృతజ్ఞత- ఒక తండ్రి ప్రతిభావంతుడైన కొడుకుని పిల్చే గర్వంతోకూడిన వాత్సల్యం- యివన్నీ గోచరిస్తూ ఉండేవి- తాత ఈ భైరవుణ్ణి ఇంతెందుకు ప్రేమిస్తున్నాడా- ఎంత భైరవుడని ముద్దుగా పిల్చుకోంటున్నా కుక్క కుక్కేగదా అనుకునేవాణ్ణి. మా వెంకన్నతాత దానికి స్నానంచేయించిగాని తనుస్నానంచేసేవాడు గాడు- దాని కంచంలో అన్నంపెట్టిగాని తను ముద్దెత్తేవాడుగాడు- చలికాలమొస్తే దాన్నొక చిన్న నులకమంచంమీద పండబెట్టి పైన కంబిళీకప్పి క్రింద కుంపటీపెట్టిగానీ తను పడుక్కునేవాడుగాడు. ఇదంతా చూస్తూఉన్నప్పుడల్లా నాకు చాలా ఆశ్చర్యంవేసి అప్పుడప్పుడు మా తాతనడిగితే అత డదోక మోస్తరు గొంతుకతో- అయ్యో, నాయనా! ఈ నాభైరవుడి మూలాన్నే యింకా నాకీభూమిలో నూకలున్నాయి. ఈభైరవుడి ధర్మాన్నే మీ వెంకన్నతాత- మీకు యీనాడు ఈ కథలు చెప్పడం-ఈమాట్లాడడమూనూ. నాభైరవుడే నాకు దిక్కవకపోతే ఈపాటి కెప్పుడో ఈప్రపంచం మీ వెంకన్నతాతని మరచిపోయిఉండును. అంటూఉండేవాడు- అంతేగాని విశదంగా ఎప్పుడూ ఏసంగతి చెప్పలేదు- నేను మాట్లసందటినో,కథల కుతూహలాన్నో అంతకుపైని తెరిచి అడగనూలేదు-

ఆనాడు- నేను పైనజెప్పిన సంవత్సరం- భోగిపండగ ఆవేళ పెందరాళే ఫలహారంచేసి- రాత్రి సుమారు 7, 7½ గంటలయి వుంటుంది. తాత వాళ్ళరుగుమీద కుంపట్లో చలిమంటవేస్తూ వుంటే నేనూ, మాతమ్ముడూ వెళ్ళి కూచున్నాము. తాత మనమిళ్ళప్పటికే సర్దుకున్నారు. భైరవుడు ఆవేళ తాతపక్కని చలికాగుతూ ఉన్నాడు- భైరవుణ్ణక్కడ చూడగానే నాకుతూహలం రెట్టించింది. తాతకి భైరవుడిమీ దింత అప్యాయ మెందుకో ఆవేళ అడిగి తెల్సుకో

---

# ఆ కాళ రాత్రి

ఆకాళరాత్రిని
ఏకాకినై నేను
ఎకడికో పోతుంప
ఆకాశమార్గాన
ఏకమై తారకలు
నాకేసిచూచి
'పక్క'మని నవ్వెనై.

*　　*　　*

ఏకాంతముగతాము
రాకాశిమూకలు
తమకేమి ఆనందమో
ఏకమై అవియన్ని
నాకేసిచూచి
'పకపకా' నవ్వెనై.

*　　*　　*

వెనుక వృక్షంబుపై
రెక్కలను కొట్టుకుని
ముక్కు ముందుకుచాచి
ఒకపక్షిరాజయ్యొ
నాకేసిచూసి
'అక్కక్క' అనుచూ
వెక్కిరింపసాగింది.

*　　*　　*

ప్రక్కప్రవాహంబు
పెక్కడగు ప్రోతలతో
మిక్కిలీచింతతో
ఎక్కడగు దుఃఖమున
నాకేసిచూసి
'వెక్క'మని ఏడ్చింది.

*　　*　　*

ఏకమైదీపాలు
కాకమై కడుగుంద
లోకమును లాలింప
ఎక్కువగు దుఃఖమున
నాకేసిచూసి
'వెక్కివెక్కి' ఏడ్చెనై.

—భమిడిపాటి

వాలనుకున్నాను. మాతమ్ముడైద్రై నా కథచెప్పు వెంకన్నతాతా అంటూంటే ఇంతట్లో నే నందు కుని కథకేంగాని తాతా మీభైరవుడు నీప్రాణం కాపాడాడంటూ ఉంటావే- నిన్నేదో రక్షించాడంటావే అదేదో- ఎలాజరిగిందో చెప్పాలి తాతా నువ్వీవేళన్నాను- తాతేమనుకున్నాడో అలాగే నాయనా! మాభైరవుడి ఆనాటిచర్య కూడా ఒక కథలాగే ఉంటుంది- కథా! కథ కంటే కూడా యింకా ఎంతో అద్భుతంగా- అందంగా ఉంటుంది నాయనా- మరి వినండి అంటూ మొదలెట్టాడు.

ఆవేళకూడా యిలాగే భోగి పండుగ- ఇప్పటికి సుమారు 12, 13 ఏళ్ళయి ఉండొచ్చును. మంచి వయసుబలంలో ఉన్నాను. నేనారో జుల్లో చాలాజోరుగా వేటాడేవాణ్ణి ఒకదుప్పులుగావు, కణుసులుగావు పులులుగావు, అడివిపందులుగావు ఒక్కదెబ్బకి- తప్పితే రెండోదెబ్బం తామని పడిపోవలసిందే ఒకమ టొగ్గడంలోగాదు- ఒకగురి చూ డ్డంలోగాదు- ఒక వెంటదరిమి వేటా డ్డంలోగాదు-ఆరోజుల్లో మనపేర చె మోగేది యీచుట్టుపట్ల. ఏక క్టరు దొరొచ్చినా నన్ను తీసుకెళ్ళ కుండా వెళ్ళేవాడుగాడు ఈప్రాం తాల్లో వేటాడ్డానికి. ఆటయిములో మాభైరవుడు- మాభైరవుడు గూడా మంచివయసులో- పిక్క బలంలో ఉన్నాడు. ఆరోజుల్లో మా భైరవు డొక్కమొరుగు మొరు గాడంటే అడివంతాదద్దరిల్లేది- సిం హగర్జనకి దద్దరిల్లినట్టు. పులులు, పందులే అదరిపడేవంటే- పరుగు పెట్టాడంటే ఒకజంతువు వెంటబడి పరుగెడుతున్నాడా- ఎగిరిపోతునా డా అనిపించేది. ఇప్పుడే మున్నాడ

[ఇంకా వుం

# ఏమిమతం, ఏమిపురాణం.

ఏమిమతం, ఏమిపురాణం
తల్లిని తనయని ఒకడే
వివాహమాడటమా?
ధర్మం న్యాయం అక్కరలేదా?
చేపా దేవుడె
కూర్మం దేవుడె
పందీ దేవుడె
రాయీరప్పా దేవుళ్ళైనా?
సిగ్గయినా లేదా వీటికి
ఏమిమతం ఏమిపురాణం—
కుక్కకు నక్కకు పుట్టిన
వారలు భూసురులేనా?
దేవతలట దేవుళ్లట,
ఇంద్రియ నిగ్రహమేలేదే?
ఏమిమతం ఏమిపురాణం—
తండ్రిమాటవిని తల్లిజంపుట
తల్లిమాటవిని తండ్రింజంపుట
ఇదేనాధర్మం?
తనసత్యంకోసం
భార్యాబిడ్డల
ప్రాణంతీయటమా?
ఇదే నామతం నేర్పేది?
ఏమిమతం, ఏమిపురాణం—
పశువులకోసం తొడనుకొయ్యటం
ఆత్మవిజ్ఞానమే లేదే?
ప్రాణంకోసం
గాజులుధరించుట
ఇదే నాధైర్యం?
రాజత్వం! స్వార్థత్యాగం?
ఏమిమతం ఏమిపురాణం—
దేవుళ్లల్లోగూడా
మనలోవలె తగవులట
జారుడు స్వర్గాధిపతియట
అసత్యమాడేవాడు
వీరదాత!
అనుకరణార్హుడు!
ముఖాన నామం
చేతిలో పురాణం
నోట్లో రాముడు
మోక్షమిస్తాయట
లౌకికమతంబట
ఏమిమతం ఏమిపురాణం—
సంస్కృతంవద్దూ
ధర్మంవద్దూ
ఏమీవద్దూ
మీధనం పారులకిస్తూ
దాసులు గానుండండి
అనిశూద్రుల నడుగుతాయి
ఏమిమతం ఏమిపురాణం,

—ఇ. శ్రీనివాసులురెడ్డి.

Printed at the Andhrabhumi Printing Works, 36 Mukatal Street. Vepery P.O, Madras.
Editor & Publisher: Andra Seshagiri Rao. B.A.